## విక్రమనామ సంవత్సర — పుష్య - మాఘమాసములు

1941-వ సం॥ ఫిబ్రవరి నెల

| తేది | వారం | వివరాలు |
| --- | --- | --- |
| 1 | శ | పం రా 10-33 ఉభా సా 4-56 తె వ 6-27 ల |
| 2 | ఆ | ష రా 1-13 రేవ రా 7-57 శేవ 8-15 క |
| 3 | సో | స రా 3-55 అశ్వ రా 11-4 సా వ 6-33 ల 8-21 క రథసప్తమి |
| 4 | మం | అ తె 6-24 భర రా 2-4 ప వ 9-52 ల 11-40 క |
| 5 | బు | న 24-0 కృ తె 4-37 ప వ 3-21 ల 5-7 క వైధృతపాత సా 4-1 ల తె 4-59 క |
| 6 | గు | న ప 8-25 రో 24-0 రా వ 9-55 ల 11-39 క |
| 7 | శు | ద ప 9-46 రో ఉ 6-34 ప వ 12-28 ల 2-9 క |
| 8 | శ | ఏ ప 10-24 మృ ప 7-51 సా వ 4-26 ల 6-4 క మతత్రయ 11 శీ భీష్మ 11 శీ |
| 9 | ఆ | ద్వా ప 10-15 ఆర్ద్ర ప 8-22 రా వ 8-16 ల 9-51 క |
| 10 | సో | త్ర ప 9-23 పున ప 8-11 ప వ 3-55 ల 5-28 క |
| 11 | మం | చతు ప7-54 ○ పూర్ణి తె5-53 పుష్య ఉ7-23 ఆశ్రే తె6-4 రా వ 7-29 ల 9-0క |
| 12 | బు | పా రా3-31 మఘ తె4-23 సా వ 5-14 ల 6-43క కుంభసంక్రమణ ప్ర॥ ప 8-22 |
| 13 | గు | వి రా 12-55 పూఫ రా 2 31 ప వ 11-45 ల 1-13 క |
| 14 | శు | త రా 10-15 ఉఫ రా 12-33 ప వ 9-7 ల 10-35 క |
| 15 | శ | చ రా 7-35 హ రా 10-37 ప వ 8-16 ల 10-40 క తె వ 6-1 ల |
| 16 | ఆ | పం సా 5-1 చిత్త రా 8-48 శేవ 7-30క రా వ 2-2 ల 3-32 క పంచమి తిథి |
| 17 | సో | ష ప 2-41 స్వా సా 7-12 రా వ 12-29 ల 2-0 క తిథిద్వయం |
| 18 | మం | స 12-33 విశా సా 5-51 రా వ 9-41 ల 11-13 క అష్టమితిథి |
| 19 | బు | అ 10-45 అనూ సా 4-49 రా వ 10-15 ల 11-48 క |
| 20 | గు | న ప 9-15 జ్యే ప 4-5 రా వ 11-58 ల 1-32 క |
| 21 | శు | ద ప 8-8 మూ ప 3-43 ప వ 2-9 ల 3-43 రా వ 1-20 ల 2-56 క |
| 22 | శ | ఏ ఉ 7-22 పూషా ప 3-44 రా వ 11-52 ల 1-30 క మతత్రయ 11 శీ |
| 23 | ఆ | ద్వా ఉ 7-0 ఉషా ప 4-8 రా వ 8-16 ల 9-55 క |
| 24 | సో | త్ర ఉ 7-3 శ్ర సా 4-57 రా వ 9-9 ల 10-56 క మహాశివరాత్రి |
| 25 | మం | చతు ఉ 7-33 ధని సా 6-13 రా వ 1-56 ల 3-39 క |
| 26 | బు | ● అమా ఉ 8-33 శత రా 7-58 రా వ 2-57 ల 4-42 క |
| 27 | గు | పా ప 10-2 పూభా రా 10-8 వర్జ్యము లేదు |
| 28 | శు | వి ప 11-55 ఉభా రా 12-45 ప వ 8-47 ల 10-33 క తదియ తిథి |

### ముఖ్య పండుగలు

3. రథసప్తమి. 8. భీష్మఏకాదశి. 11. మహామాఘము. 24. మహాశివరాత్రి.

# విషయసూచిక



**త్రివర్ణచిత్రము: శ్రీమతి కుమారి**




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# మధుపాత్ర

మహిత హేమంతశర్వరీ మధ్య జగతి, నిబిడ నిద్రాభి ముద్రిత నేత్రమయ్యె
మందుఁడై యేగుచున్నాఁడు చందమామ, అరయుమో ప్రియా! జ్యోత్స్నా విహాయసమ్ము

*　　　*　　　*　　　*

పసిడి జిలుగుల రతనాల పాత్రనిండ, బోసితే తెమ్ము మధుర ద్రాక్షాసవమ్ము
రాలిపోవును ఈ శరీరాల మరచి, తనివితీరంగ నేకమై త్రాగుదాము—
త్రాగి - ప్రణయరాహస్య గీతాల వలపు, తేటవెన్నెల జీవంపు బాటనిలిచి
చలువతెమ్మెర కెరటాలఁ గళము కలిపి, పాడిపోదము భువనముల్ పల్లవింప.

—స్థానాపతి రుక్మిణమ్మ.

# తెలుగు వెలుగు

శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

మన హిందూ మతాచారానుసారముగా మాతృస్థాన మతియుత్కృష్టమైనది. భారత, భాగవత, రామాయణాది గ్రంధములందును మాతృస్థానముయొక్క గొప్ప వేయివిధముల వాకొనబడియె.

ఇట్టి సర్వోత్కృష్టమగు మాతృదేవతకు తర్వాత మన మాతృభాష. మన తల్లియందెట్టి ప్రేమభక్తి ఆదరములు గలవో మనకు మన తల్లిభాషయందును అట్టిదే యుండితీరవలె. మన ఆంధ్రులలో స్వభాషయనుట తోడనే 'తన పెరటి చెట్టుమందు'వలె చులకనగా చూచేవారిక్కాలమున పెక్కుమందియున్నారు. స్వభాషను, నిరసించినవారు దిక్కులేని యనాథపిల్లల కెట్లు విలువయుండదో ఆలాగే వారివారి స్వధర్మములను తిరస్కరించువారు ఇతరుల తిరస్కారములకు పాత్రులగుచుందురు.

వారి నెవ్వరు లక్ష్యపెట్టరు. అట్టివారికొక నియమమనేది యుండదు. వారెల్లప్పుడు ఇతర భాషల మీది భ్రమచేత అంధులై స్వభాషలోనున్న స్వారస్యమును, లాలిత్యమును కనుగొనలేరు. నిజము చెప్పవలె నంటే మాతృభాషలో కృషిసల్పినవారు ఇతర భాషలలోగల గొప్పతనమును, అందచందములను సులభముగా తెలిసికోగలరు. ఒక్కభాషలో పాండిత్యము సంపాదించినయెడల చాలా భాషల్లో విజ్ఞానము సంపాదించ గలరు. ఆంధ్రుడై పుట్టినతరువాత ఆంధ్రభాషలోని గురుగౌరవములను తరచి దాని సౌరభమును ఆఘ్రాణించు శక్తిని బడయని అదృష్టహీనులనేమని చెప్పవలయునో తెలియకున్నది.

స్వతస్సిద్ధమైన మాధుర్యాతిరేకముగల ప్రపంచభాషలో మన తెలుంగొకటి. ఆర్యసంపర్కముగాని సంస్కృతసంపర్కముగాని యెరుంగక పూర్వమే ఆంధ్రము ద్రవిడభాషలలో ఒక్కటియై తనరారినది. ఆంధ్ర వాణి అన్యభాషలనుకూడ తనలో నిముడ్చుకొన్నది. మన తెలుంగుభాష పైశాచిక భాషలోనుంచి పుట్టినదని మన భాషాచరిత్ర దెలుపుచున్నది.

అందచందములకుగాని, హావభావములకుగాని, సుధామాధుర్యములకుగాని, వన్నెచిన్నెలకుగాని ద్రవిడభాషలలో దేనికిగాని మన తెలుగువాణి తీసిపోని ఒయ్యారముతో నిగ్గులు గూర్చుచున్నది. కావుననే "దేశభాషలందు తెలుగులెస్స"అని కృష్ణదేవరాయలు వచించినాడు. 'Telugu is the Italian of the East' అని పాశ్చాత్యులే మన తెనుగువాణిని ప్రశంసించియున్నారంటే దాని తియ్యందనమును వేరే చెప్పవలయునా?

అదేమి ప్రారబ్ధమోగాని మన ఆంధ్రులు తమకున్న గౌరవశక్తి సామర్థ్యములను ఇతరులు కనిపెట్టి చూపించేదాక గుర్తించలేరు. అది మనకొక పెద్దలోపము. అందుచేతనే మనలో ఎన్నిసంస్థలు పుట్టినను నామమాత్రావశిష్టములై పోవుచున్నవి.

అరవలలో చూడండి! వారి తల్లిభాష కెంత గౌరవమిచ్చి ఆదరించుచున్నారో! వారెన్ని దేశములు తిరిగినను, ఎన్నెన్ని భాషలు నేర్చుకొన్నను తమ తల్లిభాషను మరచిపోరు. అంతేకాదు వారువెళ్లిన స్థలము లలో వారి మాతృభాషను వ్యాపింపజేయుడమేగాక అక్కడక్కడ "దక్షిణ ఇండియా సంఘ"మని ఒక సంఘమును స్థాపించి తమ ప్రతిభాప్రాభవములను నిలబెట్టుకొనుచున్నారు.

కాబట్టియేగదా హిందీ రాష్ట్రభాషగా చేయవలెనంటే ఇయ్యకొనక వారి మాతృభాషకు ముప్పు వాటిల్లునేమో యని శంకించి హిందీ ప్రచారముతో పెడబొబ్బలు సాగించిరి.

వీరేగాదు పాశ్చాత్యులలోకూడ ఏ దేశమువారు ఆదేశపు భాషనే వాడుచుందురు. వారి కితర భాషలతో పరిచయమున్నను స్వభాషను విడచి అన్యభాషలకై ప్రాకులాడరు. వారి దేశభక్తి, జాతీయత ఎన్నదగినది.

మన యాంధ్రులలో నది సున్న. పాశ్చాత్యులకడనుండి అంధానుకరణముతో అయినవి, కానివి అన్నియు నేర్చుకొనుచున్నారేగాని ఇట్టి ఉత్తమోత్తమ గుణములను నేర్చుకొనుటకు ప్రయత్నింపరు.

మూడు ముక్కలు ఇంగ్లీషు నేర్చుకొనినంతనే ఇంటిలోగాని, వెలుపలగాని, మిత్రులతోను, చుట్టములతోను ఇంగ్లీషులోనే మాటలు మొదలు పెట్టెదరు. ఉత్తరములు సయితము ఇంగ్లీషులోనే నడుప వలసినదే. ఇదేటి అంధానుకరణమో చెప్పలేము.

అందుకని ఇంగ్లీషుగాని, హిందీగాని నేర్చుకోరాదని కాదు నా మతము - మన మాతృభాష, మన తెలుగుభాషను పునాదిగా నుంచుకొని, దానిపై యెన్ని మేడలు కట్టినను బాధకరము గానేరదు. పునాదిలేని మేడలు నిరాధారములై త్వరలో కూలిపోవును. మాతృభాషా పునాదిపై విశ్వవిద్యాలయ పట్టము లెన్నిబడసిన అన్నియు అలంకారములై మన భాషకు మరింత వన్నెగూర్చును. సౌరభము హెచ్చును. జాతీయత ప్రబలును. భాషకు కూడ నూత్నభూషణములను జేకూర్చు వార మగుదుము.

ఒక్కొక్క భాషలోను ఒక్కొక్క సౌందర్యము, గాంభీర్యము, చమత్కారము చిందులాడు చుండును. మన తెలుగుభాషలో చూడండి. "మన" శబ్దము ఎంత రమణీయముగా నున్నదో! మనవాడు, మనదేశము, మన ఇల్లు, అనునప్పుడు దానిలో ఎంత ప్రేమ, ఎంత విశ్వమానవ సౌభ్రాతృత్వము, ఎంత వాత్సల్యం, ఎంతచనువు, ఎంత సంఘీభావం, ఎంత జాతీయత తొలుకాడు చున్నది. మన శబ్దములోని రస మును నిజముగా గ్రహించినవారికి గుండె నీరు గాకమానదు. ఇట్టి పదలాలిత్యములు, సోయగములు అన్ని భాషలలోను ఉన్నది. దేనిఅందము దానిదే. దేనికదే ప్రమాణము. కావుననే అనేక భాషల్లో ప్రావీణ్యము నందు కొలదిని మానవుని మేధాశక్తి, హృదయశక్తి విశాలమయి విజ్ఞాన జ్యోతుల వెలిగించును.

ఆంధ్రులు భారతసామ్రాజ్య చక్రవర్తులై యున్నకాలమున తెలుగు వెలుగు సర్వతోముఖముగా విజృంభించినది. ఆంధ్ర వీరావతంసుల యాదరాభిమానముల నందిన శుభదినములలో ఆంధ్రప్రతిభ పదునారు కళలతో ప్రకాశించు రాకాచంద్రునివలె తనరారినది.

అప్పటి తెలుగుభాషయొక్క ఔన్నత్యమునుగూర్చి మరొకసారి తెలుపుకొందును.

ప్రస్తుతం దాని ఔన్నత్యము చెడి నిర్మాణములేక సవతితల్లి పోషణలోనున్న బిడ్డవలె నీరసముగా నున్నది. నిర్మాణము లేని భాషకు విలువయుండదు. కావున మన తెలుగుభాషకు పూర్వపు ఔన్నత్యము కావలెనంటే చక్కని నిర్మాణము కావలయును.

అది యువతుల బాధ్యతపై నాధారపడియున్నది. ఏలననగా స్త్రీలే సంఘమునకు పునాదివంటివారు. సత్య, నీతి, ధర్మములకు పట్టుకొమ్మలు, భవిష్యత్సంతానోద్ధారకులు. భావి భారత భాగ్యోదయ కర్తలగు

సత్సంతానమును వీరపురుషులుగను, విద్వన్మణులుగను, విజ్ఞాననిధులుగను, విమర్శకాగ్రేసరులుగను చేయు నధికారము, అవకాశము తల్లులకేగలదు. శిశువుల పోషణ, శిక్షణా బాధ్యత తల్లికిగాక మరెవ్వరికి? ఉగ్గుపాల నాటనుండి తల్లియొక్క యాచారవ్యవహారములు, శిశువు నేర్చుకొనుచుండును. చంటిపిల్లలకు మొదటినుంచి ఇంగ్లీషుమాటలు నేర్పితే అదియే పట్టుపడుచున్నది. తెనుగుమాటలు నేర్పితే దానినే నేర్చుకొనుచున్నారు. చిన్నతనమునందు పిల్లలకు అనుకరణశక్తిమాత్రమే ఎక్కువై యుండును. అందులోను ముఖ్యముగా తల్లినే యనుకరింపజూతురు. చక్కగా సంగీతము పాడేతల్లియైతే పిల్లలకుకూడ మంచి రాగజ్ఞానమే అలవడుచున్నది.

పూర్వ జన్మప్రయత్నమువలన నైతేనేమి, వంశసంప్రదాయ మూలముననైతేనేమి, చుట్టుపట్ల వాతావరణముచే నైతేనేమి, సాంగత్యమువల్లనైతేనేమి పిన్నతనము నుండియే ఒకని హృదయము ఒకరకమైన విద్యాశాఖపట్ల ప్రత్యేకాభిమానమును చూపుచుండును.

రవీంద్రుని కుటుంబము లలితకళలకు నాటపట్టు. చిత్రలేఖనం, కవిత్వము వారి వంశీయులు ఉగ్గుబాలతో పెట్టి పెంపొందింపజేసిరి. దీనికాధారము వారి మాతృదేవతలనియే చెప్పవలసియున్నది.

కావున మన తెలుగు వెలుగును నిలబెట్టవలెనంటే ఇప్పటి తెలుగు యువతులు కంకణము కట్టుకొనవలయును. హిందీ, ఇంగ్లీషు, సంగీతములతోబాటు మన తెలుగులోను శ్రద్ధబూని పాండిత్యము సంపాదించవలె.

హిందీ, ఇంగ్లీషులు చదివి పట్టభద్రులైతే ఉద్యోగములు వచ్చును. జీవనోపాయ మేర్పడును. తెలుగువలన అట్టి యార్థికలాభ మేదియని ప్రశ్నించెదరేమో?

మనయొక్క కళనుగాని, భాషనుగాని నేర్చుకొనునపుడు దానివలన ఉద్యోగములు వచ్చునా? డబ్బు గడించవచ్చునా? యనుభ్రమ పెట్టుకొనకూడదు. 'కళాసౌందర్యము కొఱకే కళ-భాషా సౌందర్యము కొఱకే భాష'ను నేర్వవలయును. అంటే జ్ఞానసముపార్జనమునకే యని అన్ని విద్యలను నేర్వవలయును. అట్టి యోగ్యతగలవారికి ఉద్యోగములు తమంతటతామే వెదకివచ్చును. సానలుదీర్చిన రత్నమొకచోట యున్నదంటే దాని ప్రభావ మెఱిగినవారు వెదకివచ్చి కొనకమానరు. పుష్పం వికసించగానే దాని మధువును గ్రోలుటకై మధుపములను పిలువ నక్కరలేదు. కాబట్టి మన మాతృభాషోన్నతికై పాటుపడడమే మనవంతుగాని దానివలన గలుగు లాభాలోభములు ఈశ్వరాధీనం. శ్రద్ధాభక్తులతో సల్పినకృషి యెన్నటికిని నిష్ఫలముగానేరదు. కావున తెలుగుయువతులు తెలుగువాణిని యుపేక్షింపక శ్రద్ధబూని అభ్యసించవలయునని నామనవి.

ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా,
సహస్రంతు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే.

నూఱువురు ఉపాధ్యాయులకంటె నొకయాచార్యుఁడు, నూఱువురాచార్యులకంటె నొక తండ్రియు, నూఱువురు తండ్రులకంటె నొకతల్లియు గౌరవమున నెక్కుడని చెప్పఁబడినది.

—మనుధర్మశాస్త్రము.



యోగిగాయకుడు శ్రీ త్యాగయ్య

పుష్యబహుళ పంచమి (17 జనవరి 1941) నాడు తంజావూరువద్ద నున్న తిరువాడి గ్రామమున శ్రీ స్వామివారికి ఆరాధన మహోత్సవములు బ్రహ్మాండముగ జరిగినవి.





"తల్లి ప్రేమ" లో
శ్రీమతి కన్నాంబ



# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● మాఘమాసము ●

### అశ్విని
పుత్రపీడ; అతివ్యయం; గమనం

### భరణి
శత్రువృద్ధి; కార్యనాశనం; భోజనహాని

### కృత్తిక
కార్యసిద్ధి; ధర్మకార్యముల మూలమున ధనవ్యయం; మహాసౌఖ్యం

### రోహిణి
వ్యధ; పుత్రులచే కష్టము; నీచసేవ

### మృగశిర
ద్వేషము; శస్త్రములచే గాయము; సోదరవిరోధము

### ఆర్ద్ర
జ్ఞాతివైర్యము; నూతనవిద్య; దారిద్ర్యము

### పునర్వసు
ఉద్యోగములో మార్పు; తలచినకార్యము సిద్ధించుట; ప్రభుదర్శనము

### పుష్యమి
అవమానము; చాంచల్యము; దేహారోగ్యము; సౌఖ్యము

### ఆశ్లేష
వాణిజ్య భంగము; విలాసము; విద్యాగోష్ఠి

### మఖ
క్రోధము; ఉష్ణజ్వరము; పాపకార్యము చేయుట

### పుబ్బ
అధికారము; బంధుమిత్ర సమాగమం

### ఉత్తర
విషభయము; మనోరథసిద్ధి; దైవారాధన

### హస్త
కృషివిఘ్నం; స్వేచ్ఛా విహారము; వస్త్రలాభము

### చిత్త
విచారము; మూలశంఖ; అగ్నిభయము

### స్వాతి
సత్సహవాసము; సుఖజీవనము; మనోరథ సిద్ధి

### విశాఖ
పుత్రసంతోషము; అలంకారప్రాప్తి; ఆధ్యాత్మ విచారణ

### అనూరాధ
మాతృపీడ; ధాన్యవృద్ధి; నూతన ప్రయత్నము

### జ్యేష్ఠ
సంగీతవిద్యా వినోదము: గృహమందు శుభము; స్వజన సమాగమము

### మూల
వ్యాధి; ప్రభువుల విరోధము; సంచారము

### పూర్వాషాఢ
సువార్తా శ్రవణము; ప్రయాణం; ఐశ్వర్యము

### ఉత్తరాషాఢ
వేదాంతవిచారము; అర్థలాభము; సౌఖ్యము

### శ్రవణం
ఋణబాధ; కలహము; రాజకీయ వ్యవహారములు

### ధనిష్ఠ
తాపజ్వరము; రాజస్నేహము; సంచారము

### శతభిషం
వాహనలాభం; విద్యాగోష్ఠి; వ్యాపారలాభం

### పూర్వాభాద్ర
విద్యాభివృద్ధి; సంతానసౌఖ్యం; ధవళ వస్తులాభం

### ఉత్తరాభాద్ర
కుటుంబసౌఖ్యము; యశస్సు; మృష్టాన్న భోజనము

### రేవతి
ప్రయాస; అగస్మాత్ ధనం; పశులాభము

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )



ఉంగరపు వ్రేలు చూపుడు వ్రేలుకన్న కురుచయైనయెడల దురాశ, గ్రహణశక్తిలేకపోవుటను సూచించును. మధ్య వ్రేలికన్న చాలా పొడవైన మొండిచొరవ, సాహసకృత్యములను సూచించును. చిటికిన వ్రేలును కొంచెము మించియున్న కళలయందభిలాషను, జయమును తెలుపును. చిటికిన వ్రేలితో సమానముగా నున్న వివిధవిషయ జ్ఞానము, తర్క నైపుణ్యమును సూచించును.

దీని మొదటి కనుపునకు తులారాశియనియు 2వ కనుపునకు వృశ్చికరాశియనియు 3వ కనుపునకు ధనుః రాశియనియు పేర్లు.

ఉంగరపు వ్రేలియొక్క మొదటి కనుపు విద్యాసక్తిని సూచించును. రెండవకనుపు హేతువాదమును, మూడవకనుపు ఆడంబరమును సూచించును.

మొదటికనుపు లేక తులారాశి పొడవై యుండిన లలితకళలయందు ఆసక్తిని నేర్పును సూచించును. వృశ్చికరాశి పొడవైయుండిన మట్టి పాత్రలు, పోర్సలైన్ పాత్రలుమున్నగు వాటిని చేయుటయందు నేర్పుండును. మొదటికనుపు వెడల్పుగలిగి పొరవలెనుండిన తర్కము, నాట్యకళ వీటియందు నేర్పుగలిగి మంచి వాచాలురై యుందురు.

ఈ వ్రేలియొక్క మొదటికనుపునుండి మూడవ కనుపువరకు ఒక సరళరేఖ సాగియుండిన గొప్ప ధనాఢ్యతను తెలుపును. పెక్కు రేఖలు సాగియుండిన దుర్వ్యయము హెచ్చుగా నుండును.

మూడవకనుపుమీద మాత్రము కొన్ని సరళరేఖలు సాగియుండిన విద్య, సంపత్తి, సౌఖ్యముగలిగి నిశ్చింతగా నుండును.

మరియు నీ కనుపుమీద ఒక్కరేఖ మాత్రమే యుండి, అది ఒకప్రక్కగా సాగిపోయిన మంచిపేరు, కీర్తి గలిగి గొప్పవారై యుందురు.

ఈ రేఖ చివరి పర్వమువరకు క్రిందుగా సాగియుండిన వ్యర్థులైయుందురు గాని మాటల నేర్పువలన ద్రవ్యార్జనము చేయగలుగుదురు.

మూడవ కనుపునుండి రెండవ కనుపువరకు నొక రేఖ సాగిన సత్స్వభావము గలిగి శక్తి సామర్థ్యములచే ధనము గడించువారై యుందురు.

ఈ మూడవ కనుపుమీద ఒక వంకరరేఖయుండిన గొప్ప ఆపత్తులు సంభవించునుగాని సూక్ష్మముగా తప్పించుకొనును. దీనియందు చంద్రవంక గుఱుతుండిన దురదృష్టము. శిలువగుఱుతుండిన అతి ఖర్చులుండును.

ఈ వ్రేలి మొదటికనుపు లేక తులారాశియందు శిలువగుఱుతుండిన మహాపతివ్రత. ఈ కనుపు చివరను నక్షత్రగురుతుండిన ఏ కార్యము మొదలిడినను సానుకూలమై చక్కని అదృష్టము గల్గియుండును.

(సశేషము)

# చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ

## సంక్రాంతి మహోత్సవములు

పవిత్ర సంక్రాంతి పండుగుదినాల్లో చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖకూడా పండుగ వేడుకలు జరుపుకుంది. మహదానందంతో పండుగ మూడుదినాలూ సభ్యురాండ్రంతా కలిసి వేడుకల్లో పాల్గొన్నారు.—

పెదపండుగునాడు పెద్ద సభ, సంగీత నృత్యప్రదర్శనాలూ జరిగాయి. నాటిసభకు సుప్రసిద్ధ సంఘ సేవకురాలు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

ప్రప్రథమంలో శ్రీమతి దుర్గాబాయమ్మగారు, చెన్నపురి ఆంధ్రమహాసభాధ్యక్షులైన త్యాగమూర్తి సాంబమూర్తిగారు ప్రభుత్వ బందీగా వున్నందువల్ల సభయొక్క కార్యనిర్వహణం అంతా లోటుగావుందని, వారు త్వరలో విడుదల పొందాలని భగవంతుని ప్రార్థిస్తున్నానని చెప్పారు.

మహాసభోపాధ్యక్షులు శ్రీ మంత్రిప్రగడ నరసింహంపంతులుగారు, ముత్తులక్ష్మిరెడ్డిగారి సంఘ సేవాసక్తినిగురించి ముచ్చటించారు.

శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు అధ్యక్షత వహించి మనదేశంలోని స్త్రీల స్థితినిగురించి, శ్రీమతి దుర్గాబాయమ్మగారి కార్యనిర్వహణా ధురీణతనుగురించి విపులంగా ప్రసంగించారు.

తదనంతరం—బాలికలు నృత్యప్రదర్శనాలు కావించారు.

ప్రథమంలో శ్రీ శ్రీనివాస కుల్కర్ణిగారిచే నేర్పబడిన క్రొత్తరకపు అభినయం ముగ్గురు బాలికలచే కావింపబడింది. ఈ నృత్యం ప్రత్యేకంగా ఉత్తమతరగతికి చెందిన హావభావాలతో రాణకెక్కింది.

తదుపరి, శ్రీమతి డి. హేమలతాదేవి, వరలక్ష్మి, విమలకుమారిగార్లయొక్క గాత్రపాట, జంత్ర వాద్యములు, నృత్యములతో కార్యక్రమం అత్యంత జయప్రదంగా, మానసోల్లాసంగా ముగిసింది.

సంక్రాంతి వేడుకలతోపాటు బొమ్మలకొలువుకూడా ప్రతిష్ఠించారు యీసారికూడా.—వేడుకలంతా ఒక ఎత్తు, యీ ప్రదర్శనము అంతా ఒక ఎత్తుగాను అమిరాయి.

అయితే యీ బొమ్మలకొలువు మామూలు జపాన్ బొమ్మల అలంకరణ, లేకపోతే కొండపల్లి రంగుబొమ్మల అమరుపు—ఉత్సవ విగ్రహాల్లా నించోపెట్టినదిమాత్రం కాదు.

ఈ బొమ్మలకొలువులోకూడా మనం నేర్చుకోవలసినవి చాలావున్నాయి. ఒకవైపున 'ఆదర్శ గ్రామము' (Model Village) దానిప్రక్కన భారతదేశము—వీటిచుట్టూ యితరములైన బొమ్మలు, పూలతోట్లు మొదలైనవి వున్నాయి. ముఖ్యంగా 'ఆదర్శగ్రామం' ఆదర్శవంతంగానే నిర్మింపబడింది. ఇళ్లు, రోడ్లు, నూతులు, బహిర్ ప్రదేశాలు మొదలైనవి ఆరోగ్యపద్ధతులలో ఎలా నిర్మించాలో యీ బజారు బొమ్మలతో కట్టబడిన యీ గ్రామం కన్నులకు కట్టినట్లు చూపెడుతోంది.

భాషాప్రయుక్తంగా భారతదేశం ఎలా భాగింపబడాలో చక్కగా చూపెట్టబడింది నేలమీద మట్టితో అమర్చబడిన హిందూదేశంలో. ఎక్కడెక్కడ ఏయే పంటలు పండుతాయో, ఏయే నదులు ఎల్లా పారుతాయో కూడా చక్కగా అమర్చారు దీనిలో.

ఇటువంటి యీ బొమ్మలకొలువు బుద్ధికి పనిచెప్పేదిగా, ప్రబోధకరంగా తయారుచేయబడింది. ఇది కేవలం ఒక ప్రత్యేకతను కలిగివుంది యీ వేడుకల్లో.

ప్రబోధకరంగాను, విజ్ఞానప్రదాయినిగానూ, మానసోల్లాసకరంగానూ యీ స్త్రీలశాఖా నిర్వహణాన్ని నిర్వహిస్తూవున్న దుర్గాబాయమ్మగారి చతురత వేనోళ్ల చాటడానికి, యిదే ప్రబలనిదర్శనం.

అందుచేతనే యీ సంవత్సరం అదనం నూరుమంది సభ్యులు చేరినారట—వేడుకలతో విజ్ఞానం లభిస్తూవుంది. చేరినారంటే ఆశ్చర్యం ఎందుకూ?

ఈ అభివృద్ధినిచూచి శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు పరమానందపడుతూ, దుర్గాబాయమ్మగారి సేవాసక్తినిగురించి ప్రస్తుతించారు—ఆశీర్వదించారు. దీనికి శ్రీమతి దుర్గాబాయమ్మగారు చాలా సిగ్గుపడ్డారు—వారికి పొగడ్తలు భారంగా తోచాయి గాబోలు! ఆమె సిగ్గుపడితే పడ్డారు—మనంమాత్రం ఆమెనుగురించి చెప్పుకోకుండా, ఇటువంటి కార్యధురీణను మనం కలిగి వున్నందుకు గర్వించకుండా ఎలా వుండగలం?

అత్యానందంతో ఎప్పుడూ ఆమెయొక్క సంఘసేవా కార్యక్రమాలకు హారతులు పడుతూనే వుంటాము—అదే పదివేలు.

—"గృహలక్ష్మి" ప్రతినిధి.

## ప్రావృట్కన్య

శ్రీ యార్లగడ్డ వేంకటసుబ్బారావు

(గేయము)

మెఱుపు చూపులెకాని
అఱుపు మాటలెకాని
నిజమైన నీ ప్రేమ
నిండదేమే? కోర్కె
పండదేమే చెలీ!

..........

మసిపూసి మారేడు
కాయచేస్తావేమొ
దానికీ మాతేడు
మోసపోడే చెలీ!

.........

నిండి నా బంగారు
కొండవే నీవంచు
పండినా దానిమ్మ
పండువే నీవంచు
మొండియాసలబోవునే?
నారాజు
కండ్లు మూసుకుపోవునే

.........

నీతోటిదే లోక
మేతోడు లేదంచు
నీతోడు నాతేడు
నాతోటిబల్కేడు
వేతోడి తెమ్మంచు

....... ..

నాతేని కృషియందు
నారేని పోయువో
వేరేది గతిలేదు
నీరేని పోయువో
కోరేది నీప్రేమ
చేరేది నీయండ
వేరుగా దలపోతువో
ఓ చెలీ!
మారుమాటే యాడవే!

# ★ రాజమకుటం

రచయిత :
శ్రీ గోవింద వల్లభ పంతు

అనువాదకర్త :
శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

### ముందు కథ

చిత్తోడు మహారాణా విక్రమసింహుని పదచ్యుతుని చేసి, తన కుమారుడైన వనవీరుని సింహాసనాసీనుని చేయాలనే దురూహతో కుటిల సర్దారు రణజిత్తుతో కలిసి మాయలు పన్ని, శీతలసేని, రాణాను బందీచేసింది. ఖైదులో వున్న రాణాదగ్గర, ఉదయుణ్ణి, చందన్‌ను తాను కాపాడుతానని, పన్నా ప్రతిజ్ఞ పట్టింది. రాణాను బంధవిముక్తుణ్ణి చేయాలనే మహామంత్రి కర్మచందు ప్రయత్నం విఫలమైంది. శీతలసేని ఆరాత్రి వనవీరుణ్ణి ప్రోత్సహించి రాణాను హత్యచేయించింది. సింహాసనమును సురక్షితం చేసుకొనేందుకు ఉదయుణ్ణికూడా హత్య కావించడానికి ప్రోత్సహితుడై ముందు వనవీరుడు, వెనుక శీతలసేని, ఉదయుని గదివైపు వెళ్లారు.

### పాత్రలు

1. పన్నా ... ఉదయుని దాది
2. ఉదయసింహుడు ... విక్రముని తమ్ముడు
3. కర్మచందు ... ప్రధానమంత్రి
4. బారీ ... ఒక సేవకుడు
5. శీతలసేని ... వనవీరుని తల్లి
6. వనవీరుడు ... శీతలసేని పుత్రుడు
7. రణజిత్తు ... ఒక లోభి సర్దారు
8. సన్యాసి ... ......

ఇక చదవండి

## ప్రథమాంకము

### ౧. దృశ్యము

[ఉదయుని శయనాగారము — సెజ్జమీద ఉదయుడు నిద్రపోతుంటాడు. తలగడవేపు దీపం ఉంది. కాళ్లకట్టవేపు నేలమీద పన్నా కూర్చుంది. ఆమె తొడమీద తలఉంచి పడుకుని చందన్ నిద్రపోతుంటాడు. తడవ తడవకూ ఉదయుడు కించిత్తు వ్యాకులత ప్రకటిస్తూంటాడు. అది పన్నా విచార దృష్టితో పరికిస్తూంటుంది. తిరిగి చందన్ కేసి చూచి అతనిమీద దుప్పటి కప్పుతుంది.]

ఉదయుడు :-(మేల్కొని) అమ్మా! దాదమ్మా! ఒకవేళ విక్రమసింహ మహారాణాను సర్దార్లు రేపటి ఉదయానికల్లా విడుదల చేయరేమో— ఎల్లాగు?

పన్నా :-ఏమిటి, నీ వింతవరకూ నిద్రపోనేలేదా? విచారమేమీ పెట్టుకోకు మనస్సులో, తప్పకుండా రాణా రేపువిడుదల ఔతాడు. రాత్రిళ్లు ఇంత పొద్దుపోయేవరకూ మేల్కొని ఉంటే జబ్బు చేయదు తండ్రీ!

ఉదయుడు :-నీవూ మేల్కొనే ఉన్నావుగా! నువ్వు చారణులదగ్గర నేర్చుకున్న ఆ పాటపాడితే, వింటూ నిద్ర పట్టించుకుంటాను.

పన్నా :-ఆపాటా! నీవు చాలాసార్లు విన్నావు.

(పాడుతుంది)

సింధు కాఫీ — త్రితాళం.

హే మేవాడధరిత్రీ । నీస్తుతి
గానము సేతురుగా సురనరతతి ।

౧

అహో ప్రకృతి ఎంత అందముగనో
నిర్మించెను నానా నగములనూ
వనోపవన నదీఝురంబులనూ
పై నీలితారకా కాశమునూ

౨

కుంభ - ఖుమాన - సమానవీరులను
బప్పా - సాంగా - ముఖనరవరులను
కన్నావమ్మా ! జగ ముప్పొంగెను
జయము సూర్యకుల జలధి చంద్రులకు.

(ఉదయుడు గీతికవింటూ నిద్రిస్తాడు.)

౩

అబలలుకూడా ఇట అసి తాలిచి
మహాభయద రణకేళిక సలిపిరి,
అమరయశశ్చంద్రిక లార్జించిరి,
ఆ వీరసతీమణులకిదే నతి.

౪

ఇంటింటా ప్రాకెను నీ కీరితి;
నీ ప్రచండతర రణతాండవ గతి
విని గడగడ వడకిరి శాత్రవతతి,
నీ చరితము కన్నది లోకోన్నతి !

పన్నా :-(గీతికముగించి) నిద్రపోయాడు.

(హఠాత్తుగా తెర ఆవల రోదనధ్వని)

ఈ ఆక్రందనం మహాలులోనేనే!

(ఒకబుట్టలో ఎంగిలాకులు, చీపురు పెట్టుకొని బారీ ప్రవేశిస్తాడు)

బారీ :-పన్నా ! సర్వనాశనం ! (బుట్ట దించుకుంటాడు)

పన్నా :-(తొడమీది చందనునితల నేలకుదించి గాభరాగా లేచి) ఏమిటిబారీ ! ఏమి జరిగింది?

బారీ :-వనవీరుడు జైల్లో ఉన్న విక్రమసింహ మహారాణాను చంపేశాడు.

పన్నా :-హా ! భగవంతుడా ! (ఏడుస్తుంది)

బారీ :-దుఃఖపడి లాభంలేదు. ఏడుపుకిది సమయంకాదు. అతడిప్పుడు ఉదయుని వధించటానికి ఇక్కడికి కూడా వస్తాడు.

పన్నా :-మరి ఉదయుని రక్షించే ఉపాయం ఏమిటంటావు?

బారీ :-నా మనస్సుకేమీ తోచటంలేదు.

పన్నా :-ఆశ వదలుకోవలిసిందే?

బారీ :-ఆ ఘాతుకుడికి దయగలిగితే తప్ప.

పన్నా :-ఆ పాషాణం కరగదు. ఏ విధంగానైనాసరే నీవు ఉదయునికోట ఆవలకు తీసుకుపో.

బారీ :-ఉదయుడిక్కడ కనిపించకపోతే వనవీరుడు నిన్ను చంపేస్తాడు. నీవులేక ఉదయుడు జీవించటం కష్టం. అతన్ని ఎవరురక్షిస్తారు?

పన్నా :-(భావ పరివర్తన కనబరచి) అయితే ఉదయుని ఇక్కడే ఉండనీ. (ఉత్తేజితరాలై) నే నతనిమార్గం నిరోధిస్తాను. అతని చేయి విదలించి కత్తి లాక్కుంటాను. ముక్కలు ముక్కలయ్యేలాగు కత్తిని నేలకు విసరి కొడతాను. సావిత్రి మృత్యుదేవత పంజానుండి తనభర్తను విడిపించుకుంది. ఒక మానవుని చేతి పట్టునుండి నా ప్రభుకుమారుని విడిపించుకోలేనా ? తప్పకుండా విడిపిస్తాను. వనవీరుడి హృదయంలో దయ ఉంది. అతనికి నేనంటే ఆదరభావమే.

బారీ :-కాదమ్మా కాదు. రాజమకుటం ధరించిన తర్వాత అతడు వనవీరుడు కాదు.

పన్నా :-భగవంతుడా! చిత్తోడు రాజవంశ మీరీతిని నిర్మూలము కావలసినదేనా ?... మేవాడ్ రక్షక దేవతలు! మీరైనా ఒక ఉపాయం చెప్పండి. ఈ దీనురాలు, అబల, బలియిచ్చుకొనిరైనా స్వామి క్షేమమే కోరుతోంది. (కొన్ని క్షణాలు విచారమగ్నరాలై, నిస్తబ్ధరాలైనిల్చి, క్రమేణస్వరము హెచ్చించి) మత్-శిశు-రక్త-పిపాసీ! చిత్తోడేశ్వరీ! ఆ మార్గమా చూపెడుతున్నావు ? అట్లే కానీ ! — బారీ! ఆ బుట్టలో నిద్రించుతోన్న ఉదయుని ఉంచుతాను; నీవు జాగ్రత్తగా కోట వెలుపలికి తీసుకుపో. వేరిస్ నదియొడ్డున స్మశానంలో నాకోసం కాచుకుని ఉండు.

బారీ :-అయితే మళ్ళీ మొదటికే వచ్చావన్నమాట. వనవీరుని కేమి జవాబు చెబుతావు ?

పన్నా :-అతనికన్నుల్లో దుమ్ము కొడతాను.

బారీ :-ఎలాగ ?

పన్నా :-ఉదయుని పక్కలో ఇంకొకణ్ణి పడుకోబెట్టి.

బారీ :-ఎవర్ని పడుకోబెట్టి ?

పన్నా :-చూడు, చూడు, బారీ ! నాగుండె వనవీరుని గుండెకంటే కఠోర కర్కశమైపోయింది.

బారీ :-రాక్షసతల్లీ ! ఎవర్ని పడుకోబెట్టుతావు ?

పన్నా :-చందన్‌ను,... నా బిడ్డను—

బారీ :-దయా, ప్రేమా లేని మృత్యువు ఒడిలోనా ? స్వామిరుణం ఈవిధంగా తీర్చుకుంటావా ? ప్రొద్దున్నే లేచి దణ్ణం పెట్టాలిసిన తల్లివమ్మా దేవీ !

పన్నా :-కాదు, నేను దయ్యాన్ని, రాక్షసిని. కసాయివానికత్తికి నా శిశువు నొప్పచెపుతున్నాను—బారీ! ఆలస్యంచేయకు. ఉదయుని రక్షించాలి. అతన్ని తీసుకువెళ్ళు. (బుట్టలోనుంచి ఎంగిలాకులు తీసి వేసి, అందులో ఒకగుడ్డ పరుస్తుంది పన్నా. దానిలో ఉదయుని పడుకోబెట్టి చిచ్చికొడుతుంది; మీదను వలిపెము కప్పుతుంది. పైని మళ్ళీ ఎంగిలాకులుంచుతుంది)

బారీ :-సరే, తీసుకువెళుతున్నాను.

పన్నా :-మంచిది, తొందరగా—నా నిశ్చయం మారకముందే_వనవీరుడు రాక పూర్వమే.

బారీ :-పరమేశ్వరుడు నిన్ను రక్షించునుగాక ! (పన్నాసహాయంతో బుట్ట ఎత్తుకుని బారీ నిష్క్రమిస్తాడు)

పన్నా :-(చందన్‌ను ఉద్దేశించి) అభాగ్య-పితృహీన బాలకుడు ! నిద్రపోతున్నాడు. బిడ్డా ! ఈ కఠోర భూమి—ఇదే నీకు చివరసారి తల్లియొడి !—నేను సర్పిణిని. నా బిడ్డను పదకొండు సంవత్సరాలు పెంచి తినేశాను. వెళ్ళు, నాయనా ! ప్రభువుకోసం ప్రాణాలర్పించే ధీరులకులభించే స్వర్గవాటికలో నీది అగ్రస్థానమాగాక ! పుత్రహత్యగావించుకునే పాపికికలిగే రౌరవములో నాది అధోగతియాగాక !

(మెల్లగా చందన్‌ను లేవనెత్తి సెజ్జమీద పడుకోబెడుతుంది) ఈ సెజ్జమీద నీవెన్నడూ నిద్రించ లేదు. ఇవాళ మెలకువ లేని గాఢనిద్రపో. మేలుకుంటివా రహస్యం బయటపడుతుంది సుమా! (ముసుగు కప్పుతుంది. కాని, ముఖంమీది ఆవరణ తొలగించి) అది నా భర్త తాయెత్తు. అదే ఇక నాకు నిన్నుకూడా జ్ఞాపకంచేస్తూండగల చిహ్నం. తీసుకుంటాను. (తాయెత్తుతీసుకుని ముఖంమీద ముసుగు కప్పుతుంది) ఇప్పుడప్పుడే ఎందుకు ముసుగు? అతడు రావటానికి ఇంకా ఆలస్యం ఉంది. (ముఖంమీది ముసుగు మళ్ళీతీస్తుంది) అంతవరకూ బిడ్డ మొగము చూచుకుంటూ ఉంటాను. (ముద్దు పెట్టుకోవాలనుకుంటుంది) వద్దు, వద్దు, మేలుకుంటాడేమో, ఇప్పుడు కాదు. ఎంత అందమైనముఖం! దేవతలే అందుకుసాక్ష్యం. కొంచెం ఆగి ముద్దుపెట్టుకుంటాను. వద్దు, వద్దు. అవిగో అతని యడుగుల చప్పుడు. (చందన్ ముఖంమీద ముసుగేస్తుంది)

(రక్తసిక్తమైన కటారుతో వనవీర్ ప్రవేశిస్తాడు)

వనవీర్ :-పన్నా!

పన్నా :-ఎవరు? వనవీర్! చేతిలో కటారు! దానిపై విక్రమునిరక్తం!

వనవీర్ :-ఔనౌను. చెప్పు, ఉదయుడెక్కడ?

పన్నా :-(వనవీరుని పాదాలమీదవాలి) మరచిపోకు, వనవీర్! నీవు ఉదయుడి సంరక్షకుడివి. పాపపుణ్య విచారణచేసుకో.

వనవీర్ :-శత్రువధ క్షత్రియధర్మంకాదూ? మాతృవాక్యపాలన పుత్రుడికి పుణ్యవిధికాదూ?

పన్నా :-(లేచి వనవీరు నెదుర్కొని) మదోన్మత్తుడా! నీవు ధర్మభ్రష్టుడివైనావు. నిన్నడ్డగించి తీరుతాను.

వనవీర్ :-పన్నా! అటునిల్చి ఉండు. లేదా, నీవుకూడ బలియైపోతావు. (సెజ్జవేపుచూచి) అదిగో అక్కడే ఉన్నాడు. (సెజ్జవేపు నడుస్తాడు. పన్నా అతన్ని వెనక్కు లాగుతూంటుంది. వనవీరుడు మంచం సమీపించి బాలుణ్ణి వధించేందుకు కత్తియెత్తినప్పుడు)

పన్నా :-ఆగు! అంధ ఘాతుకుడా! ఇక్కడైనా చెవియొగ్గి నీకటారుచేస్తోన్న ప్రబోధం గ్రహించు. అది అంత యెత్తునుంచి చెబుతోంది. 'భయపడు' (ఆకాశంకేసి వేలుచూపెడుతూ) 'అతనికి భయపడు' అని.

వనవీర్ :-అదికాదు కటారుచేస్తోన్న ప్రబోధం. 'ఉన్నతి పొందటానికి ఇదేమార్గం' అంటోంది. (ఉదయుడే అనే భ్రమలో చందన్‌ను వధిస్తాడు)

పన్నా :-హా! హా! రాక్షసుడా!

(వనవీరుడు నెమ్మది నెమ్మదిగా చందన్ వక్షంనుండి రక్తప్లుతమైన కటారును వెలకిలాగుతాడు. ఒకవేపునుంచి శీతలసేని, మరొకవేపునుంచి రణజిత్, ప్రవేశిస్తారు.)

వనవీర్ :-నీవూ ఇక్కడికే వచ్చేశావా? అమ్మా! ఇదిగో తీసుకో. నీయాజ్ఞ చివరవరకూ నిర్వర్తించాను. (శీతలసేనికి కటారు ఇస్తాడు)

శీతలసేని :-తే, తే, శత్రురక్తంతో నీకు రాజతిలకం దిద్దుతాను.

రణజిత్ :-మహారాణా వనవీర్‌కూ జై.

(మధ్యన వనవీరుడు; ఒకవేపున శీతలసేని నిల్చి కటారుమీది రక్తంతో అతనికి తిలకం దిద్దుతూంటుంది. రెండవవేపున కరవాలపుఛాయ ఇస్తుంటాడు రణజిత్. పన్నా మూర్ఛిల్లిపడి ఉంటుంది)

స్తబ్ధదృశ్యము.




"సంఘసేవాధురీణ" శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు

1941 సంవత్సరమునకు గృహలక్ష్మి స్వర్ణకంకణ మీ సంఘసేవా ధురీణకు బహూకరింప నిశ్చయింప బడినది



'కవికలహంసి' శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు
స్వర్ణకంకణ సన్మానసభకు అధ్యక్షత వహింతురు.

# ద్వితీయాంకము

## ౧. దృశ్యము

[వేరిస్‌నది యొడ్డున స్మశానభూమిలో. రేవులో పడవ కెరటాల తాకిడికి ఊగు తూంటుంది. బారీ ప్రవేశించి బుట్ట దించుకుంటాడు. ఉదయుడు మేల్కొని, లేచి నిల్చుని, చకితుడై]

**ఉదయుడు** :- బారీ! నిజం చెప్పు. ఎందుకు నన్నీ భయంకర స్మశానభూమికి తీసుకొచ్చావు? బుట్టలో పెట్టు కుని మోసుకొచ్చావే! అది మరీ సందేహాస్పదంగా ఉంది. నీ ఉద్దేశం నిర్దుష్టమైనట్టు తోచటంలేదు.

**బారీ** :- నాకేమీ తెలీదు బాబూ! దాది పన్నా ఆజ్ఞాపించినట్టు చేశాను, అంతే.

**ఉద** :- నీవేమీ అబద్ధం చెప్పటం లేదుకద! నీలో కుటిలవంచన ఏమీ లేదుకద! నా యీ వస్త్రభూషణాల కోసం ఈ ఏకాంతప్రదేశంలో నన్ను హత్య చేయవుకద!

**బారీ** :- హంతకుని బారినుండి మిమ్మల్ని రక్షించి తెచ్చాను.

**ఉద** :- (కంపితుడై) బారీ! నీవేదో ఒక భయంకర ఘటనాన్ని సూచనగా తెలుపుతున్నావే! విక్రమసింహ మహారాణా ఈ ఉదయం విముక్తుడౌతాడు, చూద్దామనుకున్నాను; కాని నీవు చెబుతున్నదేమిటి?

**బారీ** :- పన్నా మనల్ని ఈ స్మశానంలోనే కలసికొంటానని చెప్పింది. ఈపాటి కామె వస్తూండాలి; రాగానే నీకంతా తెలుస్తుంది.

**ఉద** :- నీవు మంచివాడివే నని విశ్వాసం కలిగినప్పటికీ, నా హృదయం ఊరికే కంపించుతోంది. పద, ఆ యిసుకతిన్నెమీద కూచుని దాదమ్మకోసం ఎదురుచూస్తూ ఉందాం. (ఇద్దరూ నిష్క్రమిస్తారు)

[తల విరబోసికొని మతిస్థిరంగాలేక, కొడుకు శవం మోస్తూ, పాడుతూ, పన్నా ప్రవేశిస్తుంది.]

కాలింగడా - త్రితాళం

**పన్నా** :-

మేల్కొరా తండ్రి! రాత్రి గడచెన్;
జీవము లిచ్చి జీవింతువురా,
నే విషమే త్రాగి బ్రతికియుంటిన్.

౧

ప్రేమామర లహరీజల మింకెగా,
హృదయము వజ్ర, మొడిశూన్యమయ్యెన్.

౨

సుతసంహారిణి ఢాకిని నైతిన్,
ఇది విషసంఘటనమురా జగతిన్.

(పాట ముగించి) మాట్లాడవేం తండ్రీ! సూర్యోదయమయింది చూడు. ఇంకా నిద్రపోతు న్నావా? లే, లే, నా ఆజ్ఞానువర్తివి కదమ్మా నీవు. సోమరివి కాదే! (కొంచెం స్మృతి వచ్చి) ఇదేమిటి,

ఇక్కడికొచ్చాను? (అటునిటు పరికించి) ఇది స్మశానభూమి! వీడి ఛాతిమీద రక్తం ఉంది. వీణ్ణి వనవీరుడు చంపాడు. మేవాడ్ సింహాసనంతో మావాడికేమీ సంబంధంలేదే! మరి వీడి అపరాధమేమిటి? వనవీరుడు కాదు వీణ్ణి చంపింది. నేనే, నేనే హంతకిని. (ఏడుస్తుంది)

[ఒక సన్యాసి ప్రవేశిస్తాడు]

సన్యాసి :- అంత దీనంగా విలపిస్తున్నావు ఎవరమ్మా నీవు? వచ్చినవాడు పోక తప్పుతుందా? ఈ నిశ్చల సత్యాన్ని నీ వెరగవూ?

పన్నా :- మహాత్మా! ఎరుగుదును. కాని మరి ఈ కన్నీళ్ల ప్రయోజనమూ కొంత ఉండాలి కదా?

సన్యాసి :- అవి యిప్పుడు దాచుకో. వాటిని సుఖసమయాల్లో ప్రసరింపగలిగితివా, దుఃఖమనేది నీకొక హాస్యరేఖగా వికసిస్తుంది.

పన్నా :- సన్యాసీ! నీ హృదయం వట్టి మరుభూమి. మాతృప్రేమ నీవెరగవు. చూడు, ఈ సుందరవదనబింబ మింత శీఘ్రకాలంలో వాడిపోతగిందేనా?

సన్యాసి :- మృత్యువుముందు తర్కము పరాజితమే ఔతుంది. ఫలానివాడు ఎందుకు మరణించాడూ అంటే చెప్పలేం. చితి ఒకటి పేర్చు. నేనూ తోడ్పడతాను. ఆ శవంతోపాటు నీ మోహాన్నికూడ తగుల పెట్టుకుని వెళ్లిపో.

పన్నా :- వీణ్ణి తగులపెట్టనా? ఊహుం. తగులపెట్టను. వనపర్వతాలనుంచి వీడికోసం సంజీవని వెదకితెస్తాను. పోయి నిర్ఝరుల నడుగుతాను ఈ పసివాడికోసం జీవనభిక్ష. (సన్యాసిని నఖశిఖపర్యంతమూ అవలోకించి) ఎంత పరిపూర్ణతేజోమయరూపము నీది! నీవు తప్పక ఒక సిద్ధుడివి. మహాత్మా! నా కొడుకును బ్రతికించవూ? (చందన్ శవాన్ని సన్యాసి చరణాలముందు ఉంచుతుంది)

సన్యాసి :- పరమేశ్వరుని యిచ్ఛను ఏ సిద్ధుడూ ప్రతిఘటించలేడు. ప్రాణికోటికి మృత్యువు తప్పదు. ఉదయమైనవాడు అవశ్యం అస్తమించవలసినదే.

పన్నా :- (ఉదయశబ్దం వినగానే రాజకుమారుడు ఉదయుడు జ్ఞాపకంవచ్చి, భావపరివర్తన ప్రకటిస్తుంది) ఆ! ఉదయ - అస్తమయమా! కాదు, మహాత్మా! కాజాలదు. తత్‌రక్షణకోసమే యీ బలి యిచ్చుకున్నాను.

సన్యాసి :- (ఏమీ అర్థంకాక) ఏమిటి అంటున్నావు?

పన్నా :- ఏమీలేదు. మహాత్మా! మాట్లాడనులెండి. మీరే ఆజ్ఞ యివ్వండి. వీణ్ణి (చందన్‌ను చూపుతూ) విడిచిపెట్టి తత్పాలన చేస్తాను.

సన్యాసి :- అయితే వెళ్లు. ఆ సమీపంలో అగ్నిగుండం ఒకటి ఉంది; అందులోనుంచి ఇంత నిప్పు పట్టుకురా. నేనిక్కడ చితి పేరుస్తూంటాను.

[పన్నా నిష్క్రమిస్తుంది. సన్యాసి చితిపేర్చి దానిమీద శవాన్ని ఉంచుతాడు. పన్నా నిప్పుపట్టుకుని ప్రవేశిస్తుంది. ఆగిపోతుంది]

పన్నా :- పట్టుకొచ్చాను నిప్పు.

సన్యాసి :- చితి అంటించు; నేను పోయివస్తాను. నీకు శుభం.

[మళ్ళీ పన్నా చితి అంటిస్తుంది. సన్యాసి నిష్క్రమిస్తాడు. చితి మండుతూంటుంది]

పన్నా :- వెళ్ళిపో, బిడ్డా! వెళ్ళు, దేశ, కాల, పరిమితి విముక్తమైన - తల్లులకు కడుపు దుఃఖమంటూ ఉండని—సనాతనలోకానికి. చందన్! కాదు, కాదు, ఉదయ్!

[బారీ, ఉదయుడు ప్రవేశిస్తారు]

ఉద :- అమ్మా! అమ్మా! నీకోసమే ఇంతసేపునుంచీ ఎదురుచూస్తున్నాం. బారీ చెబుతున్నాడు: మహారాణాను వనవీరుడు హత్యచేశాడని, నిజమేనా?

పన్నా :- ఔను. నిజమే.

ఉద :- చందన్ ఏడీ?

పన్నా :- చందన్! (చితివేపుచూచి, మళ్లీ ఉదయునికేసి తిరిగి) చందన్ నీవే. (మళ్లీ చితివేపు చూస్తుంది)

ఉద :- ఆ యగ్నిజ్వాలల్లో అంత ధ్యానపూర్వకంగా ఎవర్ని చూస్తున్నావు? నాకు బారీ అంతా చెప్పాడులే. పద. నేనా పాపిష్టి వనవీరుని తగినట్లు దండిస్తాను.

పన్నా :- వద్దు, వద్దు. ఈనాడు మేవాడ్‌లో ప్రతియణువూ నీకు శత్రురూపమే. మనం దేవలరాజును దర్శించి ఆయన శరణు వేడుకుందాం. నీ తండ్రిగా రాయనకు ఎన్నో ఉపకారాలు చేశారు. ఆయన నిన్నిప్పుడవశ్యం రక్షిస్తాడు. ఇదిగో యీ తాయత్తు చందన్ మెడలోనుంచి తీశాను; నీవు ధరించుకో. నీ నిజస్థితి యెవరికీ చెప్పొద్దు. ఎవరేనా అడిగితే నీపేరు చందన్ అనీ, నేను నీ తల్లిననీ చెప్పు. (ఉదయుని కంఠాన తాయిత్తు కడుతుంది)

ఉద :- అలాగే నమ్మా!

పన్నా :- బారీ! నువ్వు చేసిన సహాయానికి ఎంతో రుణపడియున్నాను. ఈ రహస్యం ప్రకటము కారాదదు సుమా!

బారీ :- కాదమ్మా; కాదు.

పన్నా :- పద, ఉదయ్! - కాదు, కాదు, చందన్! అదృష్టవశాత్తు ఇక్కడ పడవ సిద్ధంగానే ఉంది. ఇందులో యెక్కి ఆవలియొడ్డు చేరుకుందాం. బారీ! మన ఉదయుణ్ణి తగినరక్షణలో వొప్పజెప్పి, శీఘ్రకాలంలోనే చిత్తోడుకు తిరిగివస్తాను. నీవుపోయి అక్కడ పన్నా ఉదయుని అంతిమసంస్కారం నిర్వర్తించి చందన్‌ను తీసుకుని తన పుట్టింటికి వెళ్ళిందని చెప్పు.

బారీ :- అలాగే. భగవంతుడు మిమ్మల్ని కాపాడుగాక! (బారీ సహాయంతో ఉదయుడు, పన్నా పడవెక్కుతారు. ఆవలియొడ్డు చేరుతారు. రెండోవేపునుంచి బారీ నిష్క్రమిస్తాడు)

(తెరపడుతుంది.)

## ★ చెల్లికి ★

శ్రీ కర్లపాలెం కృష్ణారావు

చెల్లి ! వినవేమి ! రావమ్మ ! పిల్ల నిన్ను కోపగింపను, నగలిత్తు కోరినన్ని,
అడ్డుజెప్పను పాటల కాటలకును, ఒక్క మాటను వినిపొమ్ము చక్కనమ్మ !

చదువుకొనవచ్చు విద్యలు చాలినన్ని అభ్యసింపుము కళలనెన్నైనగాని,
రాజకీయార్థ శాస్త్రాల రసముపిండి, మేటి యనిపించుకొనుము నీ సాటిలేక.

కాని,

మహిమాస్పదంబగు మంగళ కరమైన తిలకంబుతీరుగా దిద్దవేల ?
జగముల శాసించి సంపదలనుబెంచు కాటుక కనులకు గలుగదేమి ?
శోభాయమానమై శుభచిహ్నమైనట్టి పారాణిలేదేమి పాదములకు
ఘల్లుఘల్లురటంచు కాంతులనెగజిమ్ము గాజులేలేవేమి కరములకును ?
ఏమిచిత్రము ! పడమటి పాడుగాలి కెంతకృత్రిమమైతివో యెఱుగలేవె ?
అందమానందమునుగూడ అంతరింప జేయువేషము మనకేల చెప్పవమ్మ !

దేశమతగౌరవంబుల దెలుసుకొనుము ! కులముగోత్రము మనమున నిలుపుకొనుము
తొంటి సాధ్వీమతల్లుల త్రోవలెఱిగి నవ్యమార్గానువర్తివై నడువుమమ్మ !

భావిభారత సౌభాగ్యపటిమ నీదు చేతలందును వ్రాసెడు వ్రాతలందు
నిలిచియున్నది–జాగ్రత ! నేర్చుకొనుము పరులు నినుజూచి నేర్చెడు పద్ధతులను.

# హిందూమతం - అహింస

వేదకాలమునుంచి అహింసయొక్క ఉత్కృష్టత, పరిణామము.

●

శ్రీ ఆకుండి వెంకటేశ్వరరావు

●

మహాత్ముడు 'అహింస'ను ఆరాధిస్తున్నాడు; అనుష్ఠిస్తున్నాడు; అఖిల ప్రపంచాన్ని తనను అనుకరించమని ఆదేశిస్తున్నాడు—
అయితే ఈ 'అహింస' హిందూమత సాంప్రదాయానికి ఎంతవరకు తోడు వస్తుంది ?—
మహాత్ముని ఆశయానికి పూర్వాపర మీమాంస—

హిందూమత ధర్మాల్లో అహింస సర్వోత్కృష్టమైనది. పంచమవేదమైన భారతంలోకూడా, అహింస సకల ధర్మాల్లోకీ శ్రేష్టమైనదనీ, మిగిలిన ధర్మాలన్నీ అహింసారూపాలే అని చెప్పబడింది.

"ధర్మ కోటులన్నియు లోనగు నిద్ధగుణ యహింస కింతనిజము"

ఆ॥ దానమును, దపంబు, ధర్మంబు యజ్ఞంబు
శౌచమంత్రతంత్ర సత్యములును
బుధులహింస రూపములుగాఁ జెప్పుట
నెల్లకల్మి సుమ్మహింసకలిమి.

శ్రుతులుకూడా "అహింసా పరమోధర్మః" అని చెపుతున్నాయి. సకల ప్రాణికోటులూ శాంతి భద్రతలతో జీవితయాత్ర సాగించుకోటాని కీసూత్రమే మూలాధారం. కాని తరువాత బయలుదేరిన బౌద్ధమతమే యీ అహింసా సిద్ధాంతాలను సృష్టించి, పోషించినదనీ, ఆ తరువాతనే హిందూమతం ఆ సిద్ధాంతాలను గ్రహించినదనీ కొందరి యభిప్రాయం. * బౌద్ధమతంలో జంతువులను చంపకూడదు గాని మాంసభక్షణ చేయవచ్చునని, బుద్ధుడుకూడా మాంసభక్షణ చేసినట్లు కొన్ని బౌద్ధ గ్రంథాల్లోవుంది.

కాని బౌద్ధయుగానికి ముందనేక సంవత్సరాలకి పూర్వమే (బుద్ధునిజననం-క్రీ-పూ. 624)హిందూమతంలో కేవలం మాంసభక్షణ నాపుటకేకాక, అనేక ఉత్కృష్టాశయములతో అహింసా సిద్ధాంతములను బోధించి, ప్రజా ప్రబోధనకు అనేక మార్గాలవలంబించారు. ముఖ్యమైనది ధర్మశాస్త్రాల్లో వాటి కెక్కువ ప్రాధాన్యం ఇవ్వడం. మన మతధర్మశాస్త్రాల్లో మనుస్మృతి ప్రధానమైనది. దానిలో జీవహింస చేయకూడదని అనేక విధాలుగా శాసించబడివుంది.

---

* బౌద్ధసూత్తములు. మహాపరినిబ్బన సూత్తము పే 72.

"స్వమాంసం పరమాంసేన యోవర్ధయితు మిచ్ఛతి
అనభ్యర్చ్య పితౄన్దేవాం స్తతోఽన్యో నా స్త్యపుణ్యకృత్.
యావన్తిపశురోమాణి తావత్కృత్వోహ మారణం
వృథాపశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్యజన్మని జన్మని."

శాస్త్రవిహిత కర్మలనుకాక, జంతువులనుచంపి మాంసభక్షణచేసిన వాడు పాపాత్ముడు. అతడు చంపిన జంతువున కెన్నిరోమాలుంటే అన్ని జన్మలలో ఘోరమరణం పొందుతుంటాడు. ♦ సాధుజంతువులను మాంసభక్షణకొరకు చంపినవాని కిహపరములందుకూడా సౌఖ్యముండదు. జంతువు నేవిధంగాను హింసించకుండా, మాంసభక్షణ అసంభవం కనుక, ఆసంగతి తెలిసికొని మాంసభక్షణ మానవలెను. దీనివలన మాంసభక్షణ, దానికి మూలమైన జీవహింస మానవలసిందని, శాస్త్రం బోధిస్తోంది. కాని సృష్టిలోనే జీవంమీద, జీవం ఆధారపడి వుండడంచేత, ఎన్నిశాసనాలుచేసినా పూర్తిగా జీవహింస మాన్పించలేరు. అందుచేత యజ్ఞయాగాదుల్లో బ్రాహ్మణులు, వేటలో క్షత్రియులు తప్ప యితరత్రా జీవహింస చేయకూడదని శాసించారు.

గృహేగురావరణ్యేవా నివసన్నాత్మవాన్ద్విజః
నావేదవిహితాం హింసా మాపద్యపిసమాచరేత్ ||

గృహస్థాశ్రమంలోగాని, బ్రహ్మచర్యాశ్రమంలోగాని, వానప్రస్థాశ్రమంలోగాని, ఆపత్కాలమందుకూడా వేదవిహితముకాని హింస చేయకూడదు. † వేదవిహితంగాచేసిన హింస అహింసగానే భావింపబడుతుందని స్మృతులు చెపుతున్నాయి.

ఏష్వర్థేషు పశూన్హింసన్వేద తత్వార్థవిద్ద్విజః
ఆత్మానంచ పశుంచైవ గమయత్యుత్తమాంగతిమ్.

వేదవిహితకర్మలలో బ్రాహ్మణులచే వధింపబడిన పశువులు, కర్తలుకూడా ఉత్తమగతి పొందుతారు. ‡ ఔషధముకొరకు, యజ్ఞయాగాదులకు చంపబడిన పశుపక్ష్యాదులకు మంచి పునర్జన్మ లభిస్తుంది.

మధుపర్కేచ యజ్ఞేచ పితృదైవత కర్మణి
అత్రైవపశవో హింస్యానాన్యత్రేత్య బ్రవీన్మనుః.

మధుపర్కమునకు (వివాహకాలమందు "నామాంసోమధుపర్కః") యజ్ఞయాగాది పితృదైవత కార్యములకు తప్ప మరెప్పుడు పశుహత్య చెయ్యకూడదని మనువు శాసిస్తున్నాడు.

ఇటువంటి యజ్ఞయాగాది కర్మలలోనైనా జీవహింస, మాంసభక్షణ చెయ్యవచ్చునన్నారు కనుక రోజూ ఆకర్మలు చేయకూడదా అని శంకించవచ్చు. * యజ్ఞయాగాదులు చేసేవాడు కొన్ని ప్రత్యేకార్హ

♦ మనుస్మృతి 5 వ అధ్యా. శ్లో. 45,48,49;. † 44, శ్లో. ‡ 40 శ్లో.

* వేదా స్త్యాగశ్చనియమాశ్చతపాంసి చ
నవిప్రదుష్ట భావస్యసిద్ధింగచ్ఛన్తి కర్హించిత్.

తలు కలిగివుండాలి. "భోగాదివిషయ సేవాసంకల్పశీలురు" కానివారు వేదనియుక్తమైన విధివిధానం ప్రకారం యజ్ఞయాగాదులు చెయ్యాలి. అల్లాచేసేవారు అప్పుడే బహుస్వల్పంగా వుండేవారు. ఇప్పుడటు వంటివారు నూటికొకరైనా వుంటారో వుండరో అనుమానమే. ప్రజలుకూడా అప్పుడు పాపభీతికలిగి ధర్మ శాస్త్రములను శిరసావహించి, వేదోక్తకర్మల నాచరిస్తూ ప్రవర్తించేవారు. ఏకారణంచేతనైనా ధర్మశాస్త్రానికి వ్యతిరేకంగా నడిచినట్లైతే రాజులు దండనీతి ననుసరించి శిక్షించటమే కాకుండా, శాస్త్రోక్తప్రాయశ్చిత్తం చేసుకుంటేగాని సంఘంలో వారికి స్థానంలేకపోయేది. జీవహింస కెంతో కఠినశిక్షలు, ప్రాయశ్చిత్తాలు విధించారు శాస్త్రకారులు.

మనుస్మృతి అధ్యా. 11 శ్లో: 108, 109, 110, 111, 112, 113, 114, 115,
అనేన విధినాయస్తు గోఘ్నోగామను గచ్ఛతి
సగోహత్యాకృతం పాపం త్రిభిర్మాసైర్వ్యపోహతి.
116, 131, 132, 133, 134, 135, 136, 137, 156 మొ॥

కనుక ఇటువంటి కఠినశిక్ష లేర్పాటుచేసి వుండటంచేతను, ప్రజలు ఆయా నియమాలను శిరసావహించి, శాస్త్రోలకిలోంగి చరించేవారవడంచేతను, ఆకాలంలో జీవహింస యజ్ఞయాగాది కర్మలలో తప్ప వుండేదికాదని వూహించవచ్చు. పూర్వం జనసామాన్యానికంతకీ పాపపుణ్యాలంటే నమ్మిక, భయభక్తులు వుండటంచేత పెద్దలు ప్రతీకార్యానికీ పాపపుణ్యాలతో సంబంధం పెట్టేవారు. అందుచేత పాపానికి భయపడి అశాస్త్రీయాచారాలు చేయకుండా పుణ్యసంపాదనకోసం శాస్త్రీయాచారాల నాచరిస్తూ శాస్త్రదూష్య జంతుహింసమాని జంతువుల నతిప్రేమతో సంరక్షించేవారు.

అదిగాక అర్థికశాస్త్రరీత్యాకూడా జంతు సంరక్షణ, అహింసావ్రతం చాలా అవసరమని గ్రహించారు పూర్వులు. అందుచేతనే కౌటిల్యుని అర్థశాస్త్రంలో జంతు సంరక్షణ విషయంలో చాలాశ్రద్ధ తీసుకోవాలని బోధించుతూ తదనుగుణ్యంగా అనేక సూత్రాలను, నియమాలను, శాసించాడు. ♦ అన్ని విధములైన జంతువులను పక్షులను ఏయేవిధంగా రక్షించాలో దీనివలన ఎంతెంత ఉపయోగాలున్నాయో వివరింపబడిన సూత్రాలనేకం దానిలోవున్నాయి. జంతు సంరక్షణ ఎంతముఖ్యమో అరణ్యరక్షణకూడా అంతముఖ్యమని జంతురక్షణకు "అభయారణ్యాల"ని (Reserved Forests) కొన్ని అరణ్యాలను ప్రత్యేకించాలనీ వాటి నేకారణంచేతనూ నిర్మూలించకూడదని శాసించబడివుంది. వీటిలో అనేక రకాలైన జంతువులు ప్రభుత్వ సంరక్షణలో వుంటాయి. ఈ అభయారణ్యాలలో క్రూర జంతువుల్నికూడా ఎవ్వరూ పట్టుకోకూడదు చంపకూడదు. † ఏనుగులు మొదలైన జంతువుల విషయంలో ఆరోగ్యాదివిషయములను వయోభేదములను బట్టి ఆహారాది విషయములను, సాలల నిర్మాణము, రక్షకులు, వారి విధులనుగూర్చి అనేకవిషయాలు రచింపబడి వున్నాయి. ‡ జబ్బుజంతువులు, ముదు జంతువులు మొదలైనవి హద్దుమీరినడిచినా వాటిని సాధుమార్గంగా బయటికి పంపివెయ్యాలిగాని ఏవిధంగాను శిక్షించకూడదు. జంతువులను బాధించిన వారికి నేరాన్ని బట్టి శిక్షలు విధింపబడతాయి. * జంతువుల జాతిభేదములనుబట్టి హింసావిధానమునుబట్టి ప్రత్యేక జరిమానాలు శిక్షలు వున్నాయి. † ఏనుగులకు గుఱ్ఱములకు ప్రత్యేకశ్రద్ధ తీసుకోవాలని అర్థశాస్త్రంలో చెప్పబడివుంది.

---

♦ II అధ్యా 17,26. † II 29, 32. ‡ III అధ్యా. 10.
* III 19. † II 2.

ఏనుగును చంపినవానికి ఉరిశిక్ష విధిస్తారు కాని సహజంగా మరణించిన ఏనుగుదంతం తెచ్చినవారికి బహుమతి యిస్తారు. ‡ గుఱ్ఱములను రెండురోజుల కొకమారు కడిగి గంధంపూసి పూలమాలలతో అలంకరిస్తారు. ప్రతీ అమావాస్య, పౌర్ణమిలకి యుద్ధపు గుఱ్ఱాలకి యుద్ధానికి వెళ్ళేటప్పుడు, వచ్చిన తరువాత, జబ్బుసమయాల్లోను పురోహితుడు మంత్రయుక్తంగా హారతులివ్వాలి.

యుద్ధ సమయాల్లో ఏనుగులు, గుఱ్ఱములు రాజ్యరక్షణకి చాలా వుపయోగపడతాయనే వాటికంత ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటారు. ఇటువంటి అర్ధశాస్త్రసూత్రాలనుబట్టి చూస్తే జంతువులయందింత శ్రద్ధ తీసుకుని సంరక్షిస్తూ జంతు హింసలకు కఠినశిక్షలు ప్రాయశ్చిత్తములు విధించటానికి అహింసా సిద్ధాంతాలయందు పాప పుణ్యాలమీద భక్తి శ్రద్ధలమాట యెలావున్నా మానవునకు వాటివలని లాభమేకారణం అని తెలుస్తుంది. ఆవులు, మేకలు మొదలైన సాధుజంతువులయందున్న శ్రద్ధ మిగిలిన జంతువులయందు లేదు. క్రూరమృగము లను వేటరూపంలో చంపటానికి శాస్త్రం సమ్మతిస్తుంది. § అర్ధశాస్త్రరీత్యా ఏ విషయానికీకూడ ఆవును, దూడలను, పాలిచ్చే జంతువులను, పనుల కుపయోగించే ఎద్దులు మొదలైన వానిని చంపకూడదు. గోవువల్ల నున్న ఉపయోగాన్నిబట్టే దానికి బ్రాహ్మణునికంటె ఎక్కువ గౌరవం ఇచ్చి (గోబ్రాహ్మణేభ్యో శుభమస్తు నిత్యం) పూజిస్తారు.

యజ్ఞయాగ పితృకర్మల్లో తప్పకుండా గోవధ చెయ్యాలని స్మృతులు చెప్తున్నాయి. అతిధికి ఆవు మాంసంతో భోజనం పెట్టాలని కొన్ని గ్రంధాలు చెప్తున్నాయి. అందుకనే అతిధికి "గోఘ్నం" అని సార్థకనామంగా వాడబడుతోంది. తన యాశ్రమానికి వసిష్టుడు వచ్చినప్పుడు విశ్వామిత్రుడు ఆవుమాంసంతో అతిధి సత్కారంచేసినట్లు ఉత్తరరామ చరిత్రలో వుంది.

తరువాత రచింపబడిన కావ్యాదుల్లోకూడా, ఋషులు ఋష్యాశ్రమాలు ఈ అహింసా సిద్ధాంతాలను పూర్తిగా ఆచరించి జంతువులపై తమప్రేమ వాత్సల్యములను ప్రత్యక్షరూపాలతో ప్రజలకు బోధించి నట్లు, కొందరు మహానుభావులు అల్పప్రాణి రక్షణార్థం స్వప్రాణాల్ని కూడా అర్పించి అహింసా సిద్ధాంతాల నధికభక్తితో ఆచరించినట్లు రచింపబడివున్నాయి. మహారణ్య మధ్యవున్న ఋష్యాశ్రమాల్లో అన్ని జంతువులు నిర్భయవిహారం చేస్తుంటాయి. రాజులు వేటకుపోయినా, అనేకనియమాలకు కట్టుబడి వర్తించాలి. ఆశ్రమ మృగాలను, సాధుజంతువులను చంపకూడదు. కాళిదాసు శాకుంతలంలో ప్రధమాంకంలో ఈ విషయం చక్కగా బోధపడుతుంది. మృగయా విహారంచేస్తూన్న దుష్యంతుడు కణ్వాశ్రమంలోని ఒక మృగాన్ని చంపబోతుంటే ఋషికుమారుడు చూచి 'వజ్రకఠినమైన నీబాణము నీ మృగ పుష్ప మృదుశరీరముపై, ప్రయోగింప వలదు వలదు'ని వారిస్తాడు.

నఖలు నఖలు బాణస్సన్ని పాత్యోయ మస్మి<br>
న్మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః<br>
క్వబత హరిణకానాం జీవితం చాతిలోలం<br>
క్వచ నిశితనిపాతాస్సార పుంఖాశ్శరాస్తే.

దుష్యంతుడు తత్క్షణం తన బాణాన్ని ఉపసంహరించుకొని ఋషికుమారునికి నమస్కరించి అతని ఆజ్ఞ శిరసావహించి వెళ్లిపోతాడు. తరువాత కొంతదూరాన్నున్న ఒక దృశ్యమును తన మాతలికి చూపుతూ

‡ II 30, 32. § II 26.



రోహిణి పిక్చర్సువారి 'తెనాలి రామకృష్ణ'లో పుష్పం భూమిక - చంద్రిక

బొంబాయిలో హిందీ ప్రచార సభవారి యాజమాన్యమున జరిగిన కోవిద, రాష్ట్ర భాషా పట్ట ప్రదానోత్సవములో, పట్టములు స్వీకరించిన యువతీ మణులు

దుష్యంతుడిలా వర్ణిస్తాడు. "చిలుకలు మొదలైన పక్షులు చెట్లక్రింద చల్లబడిన వరిధాన్యమును నిర్భయంగా ఏరుకుని గూండ్లలోవున్న తమ పిల్లలకు పెడుతున్నాయట. చిన్ని లేడిపిల్లలు మనుష్యులవలని భయంలేదని సంపూర్ణ విశ్వాసంతో, స్వేచ్ఛగా ఆడుకొంటున్నాయట."

నీవారాశ్శుకగర్భకోటరముఖభ్రష్టాస్తరూణామధః
ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీఫలభిదస్సూచ్యంత ఏవోపలాం
విశ్వాసోపగమాదభిన్నగతయశ్శబ్దం సహం తేమృగా
స్తోయాధారపథాశ్చవల్కలశిఖా నిష్యంద రేఖాంకితాః.

దీనినిబట్టి ఆశ్రమవాసులచ్చటి పశు పక్ష్యాదుల నెంత ప్రేమవాత్సల్యాలతో సంరక్షిస్తుంటారో గ్రహించవచ్చు. వారచ్చటి పశుపక్ష్యాదులను తమ పుత్రుల విధంగా భావించి సహజపుత్ర వాత్సల్యతతో ఆదరిస్తారన్న సంగతి శకుంతల వచనాన్నిబట్టి స్పష్టపడుతుంది. శకుంతల దుష్యంతుని గృహానికి వెళుతూ తన ఆశ్రమ మృగాలనిగూర్చి విచారిస్తుంది. లేడిపిల్లలకు కాళ్ళలో దర్భలు, ముళలు మొదలైనవి గ్రుచ్చుకుంటే వాటినితీసి, నూనె మొదలైనవి రాసి పరిచర్యచేసి సంరక్షించేదట శకుంతల.

ఉద్గళిత దర్భకబళా మృగాః పరిత్యక్త నర్తనమయూరాః
అపసృతి పాండుపత్రాః ముంచంత్యశ్రూణీవలతాః.
యస్యత్వయావ్రణవిరోపణమింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖేకుశసూచివిద్ధే
శ్యామాకముష్టి పరివర్ధిత కోజహాతి సోయం
సపుత్ర కృతకః పదవీం మృగస్తే.

బాలబాలికలకు సులభంగా బోధపడేలాగు, ఈ అహింసావ్రతాన్ని శిరసావహించి ఆచరించే ఆదర్శపురుషుల జీవిత చరిత్రలనేకం భారతంలో రచింపబడి వున్నాయి. శిబి చక్రవర్తి ఒకచిన్న పావుర ప్రాణ రక్షణార్థం తన శరీరాన్ని కోసి అర్పించాడు. జీమూతవాహనుడు విషసర్పాన్ని గరుడునుండి రక్షించటానికి తన ప్రాణాన్నే అర్పించాడు.

ఆ యీ విషయాలన్నింటినీ బట్టి హిందూమతంలో అహింసావ్రతం ఆదినుంచీ చాల ఉత్కృష్ట స్థానం అలంకరించి ప్రధాన మతసూత్రాల్లో ఒకటిగావుండి ప్రజాబాహుళ్యం అందరిచేతను అనువర్తింప బడినట్లు గ్రహింపవచ్చును. మన ప్రాచీన విజ్ఞాన సర్వస్వానికీ మూలాధారములైన ఋష్యాశ్రమాలే ఈ అహింసా వ్రతబోధనకి కూడా ముఖ్యాంగాలుగా వుండేవని కణ్వాశ్రమ చరిత్రని బట్టి తెలుస్తోంది. కాని యీ నాడు మన భారతదేశంలో కూడా అన్ని జాతులలోనూ జీవహింస, మాంసభక్షణ చాలా ఎక్కువగా వుంది. ఈ రెండూ శాస్త్ర సమ్మతాలే అని, పూర్వపు యజ్ఞయాగాదులను ఉదాహరణగా చెప్తారువీరు. శాస్త్రంలో 'ప్రోక్షితం భక్షయేన్మాంసం' అని మంత్రయుక్తమైన మాంసముతినవచ్చునని వుంది. ఆ ప్రకారం సకల మంత్రప్రభావ సంపన్నులైన వారప్పుడు, వేదోక్త మంత్రయుక్త కర్మలాచరించి, నూటికో, కోటికో ఒకనాడు మాంసం తిన్నారని, మనం ఇప్పుడు ప్రతిదినం మాంస భక్షణచేయడం ధర్మంకాదు. ఒకప్పుడు వ్యాసులవారు కల్లు త్రాగారని శిష్యులుకూడా త్రాగడం ప్రారంభించారట. అదిచూచి వ్యాసుల

వారు శిష్యులంతా చూస్తూండగా, సలసలకాగుతున్న సీసం గడగడ త్రాగి, శిష్యులనుకూడా త్రాగమన్నారట. ఒక్కొక్కడు చేస్తే అంతాచేయడానికి వీల్లేదు. పైగా అటువంటి కర్మలీ కలియుగంలో చేయకూడదని శాస్త్రం శాసిస్తోంది. 'అశ్వాలంబం, గవాలంబం పలపైతృకం, దేవదార సుతోత్పత్తిః, కలౌపంచ వివర్జయేత్'. * యుగాన్నిబట్టి కూడా ధర్మాలు మారుతుంటాయి. కలియుగంలో (దానమేకం కలౌయుగే) దానధర్మాలే ముక్తికీ మోక్షానికీ మార్గం అని శాస్త్రంలోవున్నది కనుక సదాచారసంపన్నులెవరైనావున్నా పుణ్యంకోసం గోహత్యలుచేసి యాగాలుచేయ నవసరంలేదు.

"తపఃపరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే।

ద్వాపరే యజ్ఞయేవాహు ర్దానమేకం కలౌయుగే' (మను.)

దానధర్మాలే ముక్తికీ మోక్షానికీ మార్గం అని శాస్త్రంలో వున్నది కనుక సదాచార సంపన్ను లెవరైనావున్నా పుణ్యంకోసం గోహత్యలుచేసి యాగాలుచేయ నవసరంలేదు. భారతంలోకూడా

వాజిమేధంబు కంటెను బూజనీయకర్మ

మందురు మాంస భక్షణము విడుపు

వినుము చంపుటయును చంప బనుచుటయును

గల్మషంబుల కెల్ల నగ్గలములధిప!

అనివుంది. కాని భారతంలో వేరొకచోట † జీవహింస, మాంసభక్షణ తప్పుకాదనికూడా వుంది. మనుధర్మశాస్త్రంలోను, అర్ధ శాస్త్రంలోను, జీవహింస చేయకూడదని బోధించినా, రెండిండికి మతాల్లో తేడావుంది. ఇటువంటి ధర్మ వైరుధ్యా లన్నిటిలోను వున్నాయని పెద్దలే అన్నారు.

వ. ధర్మంబు బహుప్రకారంబై యుండుఁదదీయ సూక్ష్మగతి దురవ బోధంబు.

శ్రుతయశ్చభిన్నాః స్మృతయశ్చభిన్నాః మహామునీ నాంమతయశ్చభిన్నాః

ధర్మస్య తత్వం విహితం గుహాయాం మహాజనో యేనగతః సపంథాః.'

కనుక ధర్మాధర్మాలు, శాస్త్రాలు ఎలావున్నా, కాలాన్నిబట్టి ఉచితానుచితములను గ్రహించి, ప్రస్తుతం యావద్భారతదేశానికి దైవసముడు, గురువు, ఆదర్శపురుషుడుగావున్న గాంధీ మహాత్ముని యుపదేశాల ననుసరించుట మనవిధి. జీవహింసవలన దేశానికీ, దేహానికీ ఎంతో నష్టం కలుగుతోందని అనేక వ్యాసాల్లో మహాత్ముడు బోధించాడు. అసలిటువంటి దురాచారాలు ప్రబలటానికి, మతధర్మాలు తారుమారవటానికి, మన మతగురువులు, మత ప్రవక్తలు, తమ విద్యుక్త ధర్మాలను మరచి, తమ బాధ్యతను గుర్తించక ప్రవర్తించటమే కారణం. అందుకనే, **There are 1½ millions of Sadhus and if every Sadhu did his duty, India could achieve much. Jagatguru Sankaracharya does not deserve that appelation, because he has no more force in him.** అన్నాడు గాంధి. కనుక జీవహింసను మాని, అహింసావ్రత దీక్షవహించి, దేశసౌభాగ్యాన్ని పెంపొందింప వలసిన బాధ్యత, మతాధికారులది – ప్రతి భారతీయునిదీని.

---

* 'తపఃపరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతా

† అరణ్యపర్వం. అశ్వా. 5

# వింతవింతల ప్రపంచం

ప్రాణంపోవడాన్ని గురించి ఇటీవల అనేకమైన పరిశోధనలు జరుగుతూవచ్చాయి. ఈ పరిశోధనల ఫలితంగా గుండెకాయ కొట్టుకోవడం ఆగిపోయినతర్వాత కూడా శరీరంలోని కొన్ని అవయవాలు వాటి పని అవి చేస్తూవుంటాయని, అందువల్ల ఏ అవయవమైనా పని చేస్తూవున్నదంటే దానినిబట్టి మిగతా అవయవాలచేత తిరిగి పనిచేయించవచ్చుననిన్ని తేలింది. అంటే, చనిపోతే తిరిగి బ్రతికించ వచ్చునని తేల్చారు. ఆలా బ్రతికించడానికి ఏం చేయాలి అనేదిమాత్రం ఇంకా తేలలేదు. ఈ పరిశోధనల మూలకంగా తేలినదేమిటంటే—గుండె ఆగిపోయిన 10 నిమిషాలవరకు మెదడు పనిచేస్తుందని, గుండెకాయ యొక్క కండరాలు 20 నిమిషాలవరకు జీవించి వుంటాయని, కళ్లు 30 నిమిషాలవరకు, చెవులు ఒకగంటకాలము వరకు, కాళ్లు చేతులయొక్క కండరాలు 4 గంటలవరకు, రక్తనాళాలు, ధాతువులు 18 గంటలవరకు, ఎముకలు 3 రోజులవరకు, చర్మము 5 రోజులవరకు జీవించివుంటాయని తేలింది. ఈ సంబంధమైన పరిశోధనలు ఇంకా జరుగుతున్నాయి.

♦ ♦ ♦ ♦

యూరోప్‌లోకల్లా స్త్రీలలో ఎక్కువ వయస్సువచ్చినవాళ్లలో మాగ్దాలిలా నిడిస్‌వెక్ అనే ఆమె. ఆమె ప్రస్తుతం వయస్సు 105-సంవత్సరాలు. ఆమె యిటీవలనే పెళ్లిచేసుకుంది, 60 ఏళ్ల అబ్బాయిని. ఆమెకు ఇదివరలో 4 వివాహాలు అయినాయి. ఆ నలుగురు చనిపోయిన తర్వాతనే యిప్పుడీ వివాహం చేసుకుంది.

♦ ♦ ♦ ♦

హార్వే హేమిల్టన్ అను ఒక యువతి విడాకులివ్వడంలోనూ, పుచ్చుకోవడంలోనూకూడా చాలా ప్రావీణ్యత సంపాదించింది.

1903లో సండర్‌లాండులో ఎర్నెస్టు హార్వే అనునతణ్ణి పెళ్లిచేసుకుంది. రెండు సంవత్సరాలు తరువాత అతడికి విడాకులిచ్చి బర్లె అనునతిణ్ణి వివాహమాడింది. మళ్లీ అతడికి విడాకులిచ్చి మొదటిభర్తను వివాహంచేసుకుంది. ఈ ప్రకారంగా 9 పర్యాయాలు యీ వివాహాలు, విడాకులు జరిగాయి. 9 వివాహములు జరిగినా ఆయిద్దరు భర్తలతోటే. కాని 1938లో మళ్లీ విడాకులివ్వడంకోసం కోర్టులో పిటీషను పెట్టుకుంటే జడ్జీ వప్పుకున్నాడుగాదు. పైగా ఆయిద్దరు భర్తలను కాక, ఇంకొకణ్ణిపెళ్లాడితే పిటీషన్ను మన్నిస్తానన్నాడు. దానికామెఇష్టపడక పిటీషను తీసివేసుకుంది.

♦ ♦ ♦ ♦

ఈజిప్టుదేశీయులైన ఒకయువతి యువకుడు విమానంలో పెళ్లిచేసుకున్నారు. ఆ పెళ్లికిరావలసిన బంధువర్గమంతా ఆ విమానంలోనే కూడా వెళ్లారు. పెళ్లితతంగం అంతా జరుగుతున్నంత సేపూ ఆ విమానం అలా గాలిలో ఎగురుతూనేవుంది. వధువుయొక్క యీకోర్కె నెరవేరడంకోసరమే మొదటి భర్తను వదిలివేసి యిప్పుడీ భర్తను వివాహమాడింది. విమానంలో ఆకాశాన తిరుగుతూ పెళ్లిచేసుకుంది, మనసు తీర్చుకుంది-అయితే, క్రిందటి సంవత్సరం దీన్నిమించినది ఇంకొక వివాహం జరిగింది.

విమానంలో వివాహమాడేందుకు ఆమె మనసుపడితే, గాలిలో ఎగిరే పారచూట్లలో ఎగురుతూ వివాహమాడడానికి ఇంకొకామె మనసుపడింది. ఆమె కోరికప్రకారం ఆమె బంధువులంతా అలా గాలిలో ఎగురుతూ వివాహ తతంగంలో పాల్గొనడానికి అంగీకరించారు. అలాగే వివాహమూ జరిగింది, న్యూయార్కు పట్టణంలో—

# దైవసంఘటన

శ్రీమతి వెలిదండ చూడికుడుత్తమ్మ



"నేను ఆరేళ్లపిల్లనుగా ఉన్నప్పుడే మాతల్లి ఇంకొకకానుపుకని తాను ఆబిడ్డ-నన్నువిడిచి పరలోకగతులైనారు. నా మేనత్త యమున మా ఇంటికివచ్చి కార్యాలు అయింతరువాత తాను ప్రయాణమగు చుండగా మాతండ్రి ఆమెనుచూచి కన్నీరువిడుస్తూ నన్ను తనఒడిలో కూర్చోబెట్టుకుని "యమునా? నీవీ బిడ్డను తీసుకొనివెళ్లి సంరక్షిస్తావని నిన్ను బ్రతిమాలుతున్నాను. ఇది పుట్టినప్పటినుంచి నీకడుపులో వేయవలెననియే మనమందరమూ అనుకుంటూ ఉండేవాళ్లము. తల్లిచేతితో నీ కప్పగింపబడే భాగ్యము ఈ చిన్నబిడ్డ నోచుకొనలేదు. భగవంతుడు ఇలాగ సంకల్పించగా అన్యథా ఏలాగు జరుగుతుంది?" అని వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టాడు. మామేనత్త కన్నీరుకారుస్తూ అన్నగారినిఓదార్చి రెండుమూడు రోజులకు నన్ను తీసికొని తనభర్త ఉద్యోగపుటూరగు కటకమునకు ప్రయాణమయింది.

మేమక్కడికి 7-40 నిమిషములకు చేరాము. మా బావ శంకరరావు రైలుకువచ్చాడు. పరీక్షలు ముందరని ఈమారు మా అత్త మాబావను ఇంటివద్దవదలి వచ్చేసింది గాని పండక్కు మా ఇంటికి వచ్చినప్పుడల్లా మా బావనుకూడా తీసుకువస్తూనే వుండేది. అప్పుడు మాఅత్త మా అమ్మకూడా మమ్మల్నిద్దరినీ బొమ్మలతో ఆడిస్తూ సంతోషించేవారు. మేమిద్దరంకూడా 'బావా' అంటే 'సావిత్రీ'అని పిల్చుకుంటూ ఎంతో సంతోషంగా ఆడుకునేవాళ్లము. అందుకని నన్ను చూడ్డంతోటే ఒక్కగంతున రైల్లోకివచ్చి నన్ను చెయ్యిబట్టుకుని దింపాడు. అరగంటలో మేమందరమూ ఇంట్లోచేరాము. మాఅత్త ఇంట్లో ఉన్నవీ లేనివీ చూసుకుంటూ భోజనపుటేర్పాటుకు వంటఇంట్లో ప్రవేశించింది. మా మామయ్య బజారుకువెళ్లారు. ఇక ఇంటంతటికీ చిక్కింది మే మిద్దరమూను. మా వదిన చిన్నపిల్ల. నేనీవరకెప్పుడూ వాళ్ల ఇంటికి వెళ్లలేదు. మా బావ నాచేయి పట్టుకుని తాను చదువుకునేగది, తాను కుట్టించుకున్న కొత్తరకపు దుస్తులూ, అప్పుడప్పుడూ తినటానికని కొనుక్కొని దాచుకున్న బిస్కెత్తు డబ్బాలుచూపిస్తూ నాకోనాల్గు బిస్కెత్తులు ఇచ్చి తనచెల్లికి రెండిచ్చి తానూ ఇన్నితిన్నాడు. నాకుకూడా మాబావచూపించే చనవూ సరదావల్ల కొత్తఇల్లనే జంకు, మా అమ్మ పోయిందనే వెలితి కనబడకుండా పోయింది.

ఈలాగే కులాసాగా రోజులు గడిచిపోతూఉన్నాయి. మా ఇద్దరిమధ్య అమితమైనప్రేమ వాత్సల్యాలు వృద్ధిపొందుతూ ఉండేవి. ఒక్కనిముషమైనా ఒకరినివిడిచి ఇంకొకరం ఉండేవాళ్లంకాము. అన్నం తింటూ ఉన్నప్పుడు, తోటలో దొంగాటలాడుతూ ఉన్నప్పుడు, వీధిలో షికారువెళ్లుతూ ఉన్నప్పుడు ఎప్పుడూ నేనూ కూడానేఉండేదాన్ని. మా అత్తయ్యకూడా నన్ను ఎంతోముద్దుగా చూస్తూ ఉండేది.

క్రమంగా నాకూ మా బావకూ యుక్తవయస్సులు వచ్చాయి. మునుపటంత ధారాళంగా నేను మాబావ దగ్గరకు వెళ్లలేకపోయేదాన్ని. మా బావమాత్రం తన స్వభావాన్ని వదలిపెట్టకపోవడమే కాకుండా తన కవసరమైన పనులన్నీకూడా నాచేత దండించైనా చేయించుకునితీరేవాడు. నేనుకూడా సిగ్గు అన్నది నన్ను అడ్డకుంటే అంతకంటే ఎక్కువ ఉత్సాహంగాచేయుటకు సిద్ధపడేదాన్ని. ఇవన్నీ ఒకకంట కనిపెడుతూఉన్న మా అత్తమామలిద్దరూ ఆలోచించి బావ బి. ఎ. పరీక్షకాగానే మా ఇద్దరికీ వివాహమును త్వరలో జరిగించటానికి ఏర్పాటు చేసుకున్నారు.

మాకు వివాహమైన కొద్దిరోజులకి మా తండ్రిగారున్నూ చనిపోయినారు.

కొద్దిరోజులలోనే నా భర్తకు కలకత్తా రెల్వేకంపెనీలో 150 రూ|| జీతమై మేమిద్దరమూ వేరింటి కాపురము చేయవలసివచ్చింది. మాఅత్త సంరక్షణక్రింద హాయిగా ఏపూచీలేకుండా కాలంగడపిన నాకు ఈ కలకత్తాప్రయాణము కొంచము కష్టమే అనిపించింది. ఆర్డరు వచ్చీ రావటంతోటే ఎక్కువ సంతోషంతో నా భర్తగారు నాదగ్గరకువచ్చి "సావిత్రీ! రేపే మన ఇద్దరిప్రయాణము. అక్కడకూడా మన మిద్దరమే ఉండాలిసుమా. అక్కడ చూడవలసినవి, అనుభవించవలసినవి కావలసినన్ని ఉన్నవి. నా బట్టలు నా సామాను, నీబట్టలు నీసామాను జాగ్రత్తగా సర్దుకోవాలి రా" అని అంటూ నాతోకూడా సామాను సర్దేందుకు మొదలుపెట్టారు.

కలకత్తాలో మాకాపురము మూడు సంవత్సరములు హాయిగా గడిచిపోయాయి. మా కుటుంబానికి తీరని కష్టములు సంభవించాయి. అకస్మాత్తుగా మా అత్తమామలు మా ఆడబడుచుగారి పెనిమిటి ముగ్గురు కొన్నినెలలు హెచ్చు తగ్గువగా కాలధర్మమందేరు. మా ఆడబడుచు పెనిమిటిపోగానే ఆమెను మా ఇంటికి తేవలసివచ్చింది. ఆమె చిన్నప్పుడు ముద్దుచేతనైతేనేమి, పెంకితనము చేతనైతేనేమి, చదువుకోవటానికిగాని అదుపాజ్ఞల్లో ఉండటానికిగాని అలవాటుపడిన మనిషికాదు. మొత్తంమీద కొంటెతనంమాత్రం ఎక్కువ. ఆమె మావద్దకు వచ్చినప్పటినుండి నన్నుచూస్తే కొఱకొఱలాడుతూ ఉండేది. పాపము చిన్నతనాన ఈ దురవస్థవచ్చిందిగదా అని నే నేచీరకొనుక్కున్నా, ఏవింతవస్తువు కొనుక్కున్నా, ఎక్కడికివెళ్లినా ఆమె సంగతినే ముందుచూసి మరీ నా సంగతిని చూచుకునేదాన్ని. ఒక్కొక్కప్పుడు ఆమె అన్నగారే ఆమె వేషభాషలకు, అసూయా స్వభావానికి, విసుక్కుంటూ మందలింపబోయేవారు. గాని నేను ఆయనకు సర్దిచెబుతూ నామీద ఆమె మరీ దుఃఖపడునని బ్రతిమలాడేదాన్ని. నేను సర్దుకుంటూ తిరుగుతున్న కొద్దీ ఆమె స్వేచ్ఛావిహారం హద్దు దాటుతూవచ్చింది.

ఒకరోజు సాయంకాలం 7 గంటలకు మామూలుగా నేను వంటలోఉన్నాను. మావారు 8½ అవుతేనేగాని ఇంటికివచ్చే అలవాటులేదు. ఆనాడు మాచాకలి 'ఏదో పనిఉంది, బాబుగారు వచ్చునప్పటికి వస్తాను' అనిచెప్పి వెళ్లిపోయినాడు. నాకు దొడ్డివైపున ఉన్నగదిలో ఏదోసందడి అవుతూఉన్నట్లు, ఏదో రహస్యంగా మాటాడుతున్నట్లు చిన్న అనుమానంకలిగింది. మా ఆడబడుచు కొన్నిదినములనుండి మా ఇంటి కెదురుగా కొత్తగా దిగిన ఒక నాయుడి కుటుంబముతో స్నేహంగా తిరగటం, అరమరభ్యంతరాలు లేకుండా హాస్యాలు ఆడుకోవటం నేను కనిపెట్టుతూనే ఉన్నాను. అందుకని నే నెరగనట్టే ఆవైపైనా వెళ్లకుండా తప్పించుకున్నాను. కాని దైవఘటన వేరుగాఉన్నది. నా భర్తగారు రావలసినవేళకంటె చాల ముందుగా వచ్చారు. నాకాళ్లు గడగడలాడాయి. ఆమెకు అన్నగారు వచ్చారని తెలియపర్చాలి. తెలిపితే ముప్పు, తెలుపకుంటేముప్పు ఏం చేయటానికి తోచలేదు. చివరకు తెగించి ఏదోపని ఉన్నట్లుగా ఆ వైపులకువెళ్లి "కామేశ్వరీ! మీ అన్నగారు పిలుస్తున్నారు"అని ప్రాణం ఉగ్గబట్టుకొని పిల్చాను.

వెంటనే కామేశ్వరి ఒళ్లు సవరించుకుంటూ ఏమీ ఎరగనట్లు ఇవతలికిరావటం, ఆ నాయుడు గోడదూకి పారిపోవటం ఒక్కసారి సంభవించింది. గాని నేను వాళ్లవ్యాపారాన్ని కనిపెట్టానని బాగా వాళ్లకు నమ్మకం కుదిరింది. ఆమె మనస్సులో నామీద ధూమానలం బయలుదేరింది. ఏవిధంగానైనా నామీద నాభర్తకుండే అనురాగలతను సమూలంగాతెంచి నన్ను పాడుచేయాలని గట్టిపట్టుపట్టింది.

ఆ నాయుడిభార్య ఒకమోస్తరు అందగత్తె. తరుచు ఆమె మా కామేశ్వరివద్దకురావటం, నాభర్త గారు హాల్లోకూర్చుని ఉంటూఉంటే ఆ యిద్దరు ఆ ఎదుటిగదిలోనే ఏదో నెపంపెట్టుకుని కాలక్షేపం చేస్తూ ఉండేవారు. నా అదృష్టంకొద్దీ నాకూ ఆ రోజుల్లోనే నలతప్రారంభించింది. అందువల్ల అన్నిపనులూ కామేశ్వరే జరుపవలసివచ్చేది. నా కంతకంతకూ జ్వరముహెచ్చి మేడ దిగలేనిస్థితిలోనికి వచ్చాను. డాక్టరు వచ్చిచూచి పోతూఉన్నాడు. ఒకరోజు నా భర్తగారు రోజూ వస్తూఉన్నట్టుగా వంటరిగారాక ఆనాయుడితో ఏదో మాట్లాడుతూ నా దగ్గిరకువచ్చారు. నా కతనిని చూడంగానే ఒకవిధమైన భయోత్పాతమైంది. నాభర్త ఇది ఏదీ కనిపెట్టనేలేదు. అతనిని కొంచందూరంలో కూర్చోబెట్టి ఆయన నామంచంమీధ కూర్చుని "ఏమి సావిత్రీ! ఎలాగున్నది? నేని వంటరితనాన్ని భరించలేకుండా ఉన్నాను. ఇంటికివస్తే నాతో చనువుగా మాటాడేవాళ్లు లేకపోతే నాకుతోచదు. దేవుడు నాకీలాంటి స్వభావంపెట్టడం ఒక దురదృష్టమే." అని విచారంగా పలికారు. నేనూ సవిమర్శంగా ఆయనపైపుచూస్తూ "ఇందులో నాలోపమేమున్నది. భగవత్సంకల్పం నాయడల ఈలాగుంటూంటే ఎదురీదటానికి నావల్లనవునా? అయినా ఇప్పుడు కొంచము నయంగానే ఉంటున్నదిగదా! మీరు ధైర్యముతెచ్చుకొని నాకు ధైర్యమీయవలెనుగాని మీరే తొందర పడిన ఇంక నేనేమిచెప్పను" అని అంటూ ఆ నాయడ్నిచూచి "ఆయనెవరు?" అని అడిగాను. ఆ ప్రశ్నకు సరియైన జవాబీయుటకు దొంగతనం చేస్తూఉన్నట్టు కనబడ్డారు. మునుపెప్పుడూ ఇటువంటి స్వభావం ఆయనలో లేకపోవడంవల్ల నేనూ ఇక ముదరికించకుండా ఊరకున్నాను. ఇంకా ఏవేవో రెండుమూడు ఊసుపోని సంగతులుమాట్లాడి క్రిందికి అతనితో దిగిపోయినారు.

నేను పూర్తిగా మంచం దిగటానికి సుమారు 3 నెలలుపట్టింది. మొదట్లో ప్రతి నిమిష నిమిషానికి వచ్చి నా యోగక్షేమం కనుక్కుంటూ ఉండేవారు. అంతకంతకూ ఆయనదర్శనమే నాకు అపురూపమై పోయింది. మామూలుగా ఇచ్చేజీతము నాచేతికిరావటం ఆగిపోయింది. సంగతి సందర్భాలు పూర్తిగా నాకు బోధపడినవి. నా ఆడబడుచు పట్టినపట్టు నెరవేర్చుకుంది. నాకొంపకు చిచ్చుముట్టించింది. నాభర్తను మందలించుదామని ఎన్నిసార్లు నేను ప్రయత్నించినా ఆయనదర్శనమూ దుర్లభమైంది. నాకూ సాహసము లేకపోయింది. ఎందుకంటె మొదటినుంచీ ఆయన స్వభావము నేనెరుగుదును. ఆయనే తన ఇష్టానుసారము పోవలసినవారేగాని అంతు కనుక్కొనేవరకు వెనక్కుతిరిగేవారుకారు. ఒకరోజు మేడమీద ఆయన వంటరిగా కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉన్నారు. అదేసమయమనుకుని తెగించి నేనువెళ్లి నిల్చున్నాను. నన్నుచూచి చిరునవ్వునవ్వారు. నాకుమాత్రం పట్టలేని దుఃఖంవచ్చింది. ఆయన నాముఖం ఎత్తి కన్నీరుతుడుస్తూ "ఎందుకీలాగు వెర్రిదానిలాగు ఏడుస్తున్నావు! నీకు జరిగిన లోపమేమిటి? నేను మునుపట్లాగ కనబడటంలేదనేనా? నీవందుకు విచారించకూడదు. ఒక్కొక్క సమయంలో ఒక్కొక్కవిధంగా వ్యక్తి మారుతాడనే ప్రకృతి రహస్యం తెలుసుకొని నిదానించాలి." అని నన్ను ఓదార్చారు. ఆమాటలు శూలములవలె నాటాయి. ప్రత్యక్షంగా తనమార్పును సమర్థించుకుంటూ ఉన్నమనిషితో నేనేం మాట్లాడగలను? నేనేం వ్యతిరేకంగా మాటాడిన ఈమాత్రం సానుభూతి దొరకదని నాకు బాగాతెలుసు. కాని కంటి నీరాగలేదు. ఆలాగేనిల్చుని నేను "మీవంటివారుకూడా ఇంతత్వరలో నిష్కారణంగా మన ఇద్దరి చిన్నప్పటినుంచీ మనతోకూడా అవిచ్ఛిన్నంగా వృద్ధిపొందుతూవున్న మన శాశ్వతానురాగలతను నూలుపోచకన్న కనికష్టంగా త్రెంపుకుందుకు సాహసిస్తారని నేను కల్లోకూడా ఊహించలేదు. స్ఫటికమువలెనున్న మీ పవిత్రహృదయం ఇట్టి పరి

కామాన్ని పొందటం నా దురదృష్టమే అని భావించి ఊరుకోవలసినదేకదా." ఇంక నేను ఒక్కమాటను కూడా పలకలేకపోయాను. ఆయన ఇంకా ఏమీ ఎక్కువమాటాడక "మరేం భయంలేదు. నీకోరిక నేను కనబడటమేకదా? సరేలే. నాకుపని ఉన్నది" అని అంటూ నావైపుచూడనైన చూడకుండా క్రిందికిదిగి వెళ్లిపోయినారు. నేనలాగే స్థాణువునైపోయినాను. నాకేమి చేయుటకుతోచలేదు. అలాగే ఆ మంచంమీద ఏడుస్తూ ఎంతసేపున్నానో ఆ పరమాత్మునికేతెలుసు.

ఈవిధంగా మరో ఆరునెలలు గడిచాయి. నా దౌర్భాగ్యదేవతయే నాల్గువైపులా కనిపిస్తున్నది. ఇంట్లో విలువైన సామానులన్నీ నాయుడు ఇంట్లోకి వెళ్లినవి. చివరకు పండుకొను మంచాలు కూర్చున్న కుర్చీలు సహా నడచినవి. నా వంటిమీద అలంకారములు అప్పులకని, నా మందులకనీ చెప్పి ఆవరకే పూర్తి చేసేరు. ఒకరోజున నా రోజుల దీనతను విచారిస్తూ సావిట్లో కూచున్నాను. నా భర్త జోగుతూ ఇంట్లోకివచ్చి పడ్డారు. నేను దగ్గిరకువెళ్లి మీద చెయివేసి 'ఏమిలాగున్నారు?' అని అడిగాను. నావైపు వెర్రిచూపు చూస్తూ 'నీవద్ద ఏమైన సొమ్మున్నదా' అని ఆజ్ఞగా అడిగారు. 'మీకెరుగనివి నావద్ద నేమున్నదని' నేను బదులీయగా 'నీ మెడలో ఏబదిరూపాయల విలువగల ఆ మంగళసూత్రమిమ్మని' చేయిజాపారు. ఆ క్షణమందున్న నా మనఃస్థితిని నేనేలాగు చెప్పవలెనో నాకు తెలియదు. నా యావచ్ఛరీరంలోకి ఒక విద్యుచ్ఛక్తి వ్యాపించినట్లైంది. ఏమి బదులివ్వటానికి తోచక కొయ్యబారి నిలబడ్డాను. ఆ ఆలస్యమునకు ఆయన సహించలేక గర్జిస్తూ, 'ఏమీ ఈయదల్చుకోలేదా?' అని తిరిగి అడగ్గా నేను ఏడుస్తూ కాళ్లమీదపడి ఈ పని కూడదని బ్రతిమాలాను. నన్ను ఈ తృప్తితోనైనా ఉండనీయుడని వేడుకున్నాను. మన ఆ జన్మాంత బంధనమును త్రెంపజూచుట చాల పాతకమని వెక్కివెక్కి ఏడ్చాను. ఏమనినను లాభము లేకపోవటం సరిగదా— 'ఛీ దుర్మార్గురాలా! నామాటకు బదులాడుతావా? ఈ పీడ ఎప్పుడు వదుల్తుందని చూస్తున్నాను. నీ వికమీద నా కంటికగపడకూడదు అవతలికి పో' అని నా మెడలోని పవిత్రమాంగల్యమును తీసికొని నన్నవతలికి త్రోసి తలుపువేసుకుని ఎక్కడికో వెళ్లిపోయారు.

నన్ను తల్లిలాగు మేమూఊరు వెళ్లినప్పటినుండీ కనిపెటుతూఉన్న మీనాక్షమ్మగారిది మా పొరిగిల్లే. మా సంభాషణ, నన్ను వీధిలోనికి త్రోయడం, నేను గుమ్మములో చతికిలబడి ఏడవడం ఆమె కనిపెట్టింది. నా భర్తగారు గుమ్మముదిగి వెళ్ళగానే 'అబ్బా! ఆ నరపశువు ఎంత పనిచేశాడు' అని అంటూ నావద్దకు వచ్చి 'అమ్మా! సావిత్రీ! దుఃఖపడకు మా కమలతో నీవుకూడా ఒక బిడ్డవని అనుకుంటాను. ఆ దుర్మార్గుడు నీవంటి ఉత్తమురాలియెడ ఇంత నీచంగా ప్రవర్తిస్తాడని నేనింతవరకూ అనుకోలేదు. ఎప్పటికైనా నీ సత్స్వభావమువల్ల అతడు మామూలుస్థితిలోనికి రాక మానుతాడా అని ఆశించాను. వానికేదో మూడబట్టే ఇంత దౌర్జన్యానికి తెగించాడు. ఇంక లే.' అని అంటూ నాచేతిని పట్టుకుని లేవనెత్తుతూ కన్నీరొత్త మొదలిడింది.

మీనాక్షమ్మగారి ఆదరణను నేను మరువలేను. నా భర్తగారు నేను వారింటిలో ఉన్నానని ఆ ఇంటినే వదిలివేశారు. ఎన్ని ఇక్కట్లువచ్చినా భగవంతునికి ఎప్పటికైనా దయరాదా అనే విశ్వాసము నన్ను కొన్నిదినములు జీవితాశలో ఉంచినది. వారింట్లోనే వారి బిడ్డవలె కొంతకాలం గడిపాను. నా భర్తగారి ఆచూకి మీనాక్షమ్మగారికి తెలియుచున్నప్పటికీ నాకు విచారముగా ఉండునని కాబోలు నాతో

ఆ ప్రసంగము ఎత్తేవారు కారు. ఇలాగు సుమారు ఒక సంవత్సరం గడచింది. ఒకరోజు సాయంకాలం నాపేర ఒక కవరు వచ్చింది. విలాసముయొక్క దస్తూరి నా భర్తగారిది. నా వళ్లు వణకింది. ఈశ్వరునకు నామీద అనుగ్రహము కల్గినదని ఆయనకు ధన్యవాదము లర్పించాను. నా చేతులు ఆ జాబును విప్పలేకపోయి నవి. నా స్థితినిచూచి మీనాక్షమ్మగారు జాలిపడుతూ తన కూతురగు కమలను చదువమన్నది. ఆమె విప్పి ఈవిధంగా చదివింది.

చి॥ సౌ॥ సావిత్రికి ఆశీర్వచనములు.

నిన్ను స్మరించుటకునైన అర్హతలేని నీ భర్త తన దీనదశయందు పంపిన ఆఖరు సందేశమును తెలుసు కుని సాహసముచేయక ఇంతవరకు నీవు చూపించిన ఓర్పుతోటే జీవితవిశేషమును గడుపుదువని నమ్ము చున్నాను. నేను నీయడల ఘోరకరమైన అన్యాయమును, దౌర్జన్యమును చూపించి పశువుకన్న హీనముగా ప్రవర్తించిన నన్ను క్షమింప వేడుచున్నాను. నా పాపమునకు తగిన ప్రాయశ్చిత్తమైనది. నావంటి కౄరునకు ఈ ప్రపంచమందు తావులేదు. నా తరువాతి చరిత్ర నీకుచెప్పి నా జీవితమును ఈ హుగ్లీనదీ గర్భమున విడువ దలచితిని. ఆవిధముగా నిన్ను అవమానించి నేను తిన్నగా ఆ రాక్షసింటికి వెళ్లితిని. ఆమె నన్ను లాలిస్తూ అప్పటికి నేను కోరుతూఉన్న ఇంకో బ్రాందిబుడ్డిని నాకందించినది. నేను పరమానందంగా పశుస్వభావంతో విహరించితిని. ఆ సమయంలో నాచేత నా ప్రావిడెంటు ఫండు నాల్గువేలు వ్రాయించుకున్నది. ఇంకొక వారమునకల్లా నా అధికారిమీద నేను చూపించిన అమర్యాదకు నన్ను పనిలోనుండి తొలగించినట్లు ఒకజాబు వచ్చినది. ఈ సంగతి ఆ రాక్షసికి తెలిసే ముందుగా నాచేత వ్రాయించుకునియుండును. ఆమె ఏదో పని ఉందని బొంకి అక్కడనుండి రాజమండ్రికి వెళ్లిపోయినది. ఆమె వారముగోజులలో తిరిగి వస్తానన్న మనిషి నెలకూ రాలేదు. నాచేత ఒక్క కానీ లేదు. నా స్థితినిచూచి ఒక స్నేహితుడు ప్యాసు ఈయగా నేను రాజమండ్రికి వెళ్లేను. ఆ క్రూరురాలి బస కనుక్కొని లోపలికి వెళ్లాను. నన్ను చూచీ చూడ్డంతోనే ఆమె ప్రవర్తించిన ప్రవర్తన నాకు తగినదే అని నేనిప్పుడు తెలుసుకున్నాను. ఒక జవానును పిలిచి ఈ ఒళ్లుతెలియని పశువును లోపలికెందుకు ప్రవేశపెట్టావని గద్దించినది. నేను గిఱ్ఱుమని తిరిగి వీధిలోనికి వచ్చాను. ఆహా! దైవమన్నవాడు ఉన్నాడు. పాపమునకు శిక్ష కలదు. నిన్నెట్టిస్థితిలో నేను దించానో నా కట్టి స్థితియే, అంతకంటె హీనమైన స్థితియే ప్రాప్తించినది. కాని ఏంచేయగలను. అదే బండిలో తిరిగి ఈఊరికి వచ్చాను. అధికారికి క్షమాపణ చెప్పుకున్నాను. లాభములేకపోయినది. నిన్నుచూచి నీ కాళ్లమీద పడవలెనని అను కున్నాను. నా స్పర్శ నిన్ను మలినపరుచునని మనస్సును మళ్లించుకుని తిన్నగా నదికే వెళ్లిపోవుచున్నాను. ఈ దుర్మార్గుడిని ఈ కృతఘ్నుడిని మరచిపో. నీవెప్పుడూ నమ్మి కొలుస్తూఉన్న ఆ ఈశ్వరుడే నీకు శరణ్యుడు. ఈ లోకములో ఇదే ఆఖరు శెలవు—

అనే జాబును కమలం చదివి ఊరుకున్నది. ఒక పిడుగడచినట్టు వెఱ్ఱిదాననైనాను. ఎంతమంది వద్దంటున్నను నా మేనమామల ఇంటికని ఈ రాజమండ్రికి వచ్చాను. ఆ రాక్షసిని చూచి నా బాధ తీర శపించవలెనని అనుకున్నాను. మళ్లీ తమాయించుకుని ఎందుకూ పనికిరాని ఈ జీవితమెందుకనే తెగువ నన్నీ గోదావరిలోనికి ఈడ్చుకొనిపోయినది”



పారచూట్ల (గాలిబుట్టలు) సహాయముతో విమానముల నుండి క్రిందకు దిగుటకు,
యుద్ధ తరిఫీదులు పొందుచున్న రష్యా వనితలు

చెన్నపురి ఆంధ్రమహాసభ — స్త్రీశాఖ

# సంక్రాంతి మహోత్సవములు





బాలికల భరతనాట్యం




# కళవల్ల ప్రయోజనం

శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవి

చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖవారి అధ్వర్యాన్ని జరిగిన వారాంతోపన్యాస సందర్భంలో శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవిగారు కళ యొక్క ప్రాముఖ్యతని గురించి ఉపన్యాసించారు. వారి ఉపన్యాసములో ఇవి కొన్ని ముఖ్య విషయాలు—

కళ సామాన్యమయినది కాదు. కళాప్రబోధమువల్ల మనము ఎంతైనా ప్రచారం చేయవచ్చును. విద్యాసంస్కారము ఉత్సాహము కలిగినవారు ముందుకువచ్చి కళకుతగిన ప్రోత్సాహము కలుగచేస్తే చాలా వున్నతస్థానమునకు రాగలదు. దీనికి అందరి సహకారం అవసరము. ఒక్కరివల్ల కాదు. వుత్సాహంకల అందరూ ముందడుగువేయాలి. ఇదివరలాగు కాకుండా ప్రస్తుత పరిస్థితులనుబట్టి పిల్లలు చాలా వుత్సాహంతో నేర్చుకోవాలనే ఆశతో ముందంజవేస్తున్నారు. తగిన ప్రోత్సాహము వారికి లేక యింకా వెనకగానే వున్నారు. దానికై అందరం పాటుపడాలి. అప్పుడుగాని కళ రాణించదు.

కళయొక్క ప్రయోజనము ఆత్మవికాసము కలిగించడమే గాని వినోదము కలిగించుట కాదు. పూర్వపురోజుల్లో మనదేశంలో కళకి యెంతో ప్రాముఖ్యత వుండేది. ఈ రోజుల్లో పరప్రభుత్వము వారికి మన దేశములలోని కళ బోధపడదు. అందువల్ల ముందుకి రాలేదు. ప్రజాప్రభుత్వం ఏర్పడితేనేగాని మన కళలు ఉన్నతంగా ప్రకాశించవు. రష్యాదేశము కొద్దికాలంకింద ఎంతో వెనుకపడివుండేది. అక్కడ ప్రజాప్రభుత్వము ఏర్పడిన తర్వాత ప్రభుత్వంవారు సినీమాలు, నాటకాలు తమ పోషణక్రింద పెట్టుకుని వాటిద్వారా ప్రజలకి ప్రబోధము అతిత్వరగా చేశారు. పాఠశాలలలో ఒక సంవత్సరములో చేయగల జ్ఞాన బోధ ఒక్క సినీమాద్వారాగాని, నృత్యంద్వారాగాని చేయవచ్చును. కళ ప్రతీ వారిలోనూ ప్రతీ అడుగులోనూ ప్రతి విషయములోనూ ప్రతిధ్వనిస్తూనే వుంటుంది.

ఒక్కొక్కరికి ఒక్కొక్క కళయందు అభిరుచి వుంటుంది. ఒకరికి గానమందు, యింకొకరికి నృత్యమందు, మరొకరికి నటనయందు, వేరొకరికి చిత్రకళయందు అభిరుచులు వుంటాయి. అందరూ ఏకమైతే కళాప్రబోధము ఎంతైనా చేయవచ్చును.

చిన్నపిల్లలకి స్కూళ్లలో 'గొంతెమ్మ కోరికలు' అనేపాట ఏడాది నేర్పుతారు. మనంకూడా మన చిన్నతనంలో భట్టీ పెట్టేవున్నాము. యిదేనీతిని వుదయశంకరుని నృత్యంలో ప్రదర్శించారు. మీరూ చూసేవుంటారు. నిద్రలో కల...అప్సరసలు వచ్చినట్టూ, ఆకాశవీధులలో సంచరించినట్టూ, సింహాసనమూ,

రాజులూ, యింకా, యిలాటి గాలిమేడలలో వుర్రూతలూగి చివరకి అంతాపోయి మిగిలింది ఎడారిమాత్రమే. పుస్తకంలో భట్టీ పట్టడంకన్నా కళ్లకికట్టినట్లుగా ప్రత్యక్షంగా ఆ నృత్యం చూస్తూవుంటే అంతా మాయకదా అనే వేదాంతంకూడా మనకి స్ఫురిస్తుంది.

'స్త్రీ' అని యీమధ్యనే హిందీ సినీమా వచ్చింది. మీలో కొంతమంది చూసేవుంటారు. 'తల్లిదండ్రులమాట వినాలి' అని పద్యాలద్వారా పాటలద్వారా బోధించే నీతి యీ సినీమాలో చూపించారు. తల్లిమాటవినని పిల్లలగతి ఎంత హీనస్థితికి వస్తుందో, ఏస్థితిలో వాళ్లు వుంటారో, ఎంత కష్టపడతారో చూపించారు.

యిలాగే నాటకాలద్వారాగూడా ప్రబోధం చేయవచ్చును. యిలా ప్రచారంచేసే నాటకాలు ప్రస్తుతం లేవనే అనాలి. తగినసహాయంలేక యింతవరకూ ప్రచారంచేసేవి ఏవీ మనదేశంలో రాలేదనే చెప్పాలిసివస్తుంది. ఇప్పుడిప్పుడు అతి వుత్సాహంతో అందరూ ముందుకువస్తున్నారు. పిల్లలకి ఏ కళలయందు అభిరుచులు వున్నాయో మనం తెలుసుకునీ వారికి తగిన ప్రోత్సాహము యిచ్చి, వాళ్ళ ద్వారా మనము యికనైనా ఎంతో కళాసేవ చేయవచ్చును. దీనికి ముఖ్యంగా విద్య, సంస్కారము కలిగివుండాలి. తగిన వాతావరణము వుండితీరాలి. తగిన విద్యాబుద్ధులు లేకుండా పిల్లల్ని సినీమాలలోగాని, నాటకాలలోగాని, నృత్యాలలోగాని దింపకూడదు. కేవలము నృత్యమువల్లగాని, నటనవల్లగాని కళాసేవ చేయలేము. అభిరుచులు గల అందరూ కలిసి ఒకరికి యింకొకరు తోడ్పడి ఒక సంస్థగా ఏర్పడి యింకముందైనా ఏడాదికి ఒకసారి చాలు ప్రదర్శనాలద్వారా ఎంతో జ్ఞానబోధ చేయవచ్చును. మనం అందరం ఏకమైతే తప్పక మనకి ప్రభుత్వ సహకారంకూడా లభిస్తుందని తలుస్తాను.

## తిక్కనా!

తే. గీ. పూజ్యమగు గౌతమీ గర్భమున జనించి
ఆమహర్షి ఆశీస్సుధ నారగ్రోలి
వ్రతములెన్ని సల్పితో! కవిబ్రహ్మ కొఱకు
అదిగో! నీ ప్రేమమూర్తి ప్రత్యక్షమాయె!
చిరతపశ్శుచియగు నొక్క స్నిగ్ధ హృదిని
ఎవ్వడు నిరాకరించునే ఋషి కుమారి!
ఆత్మ నర్పించుకోవమ్మ ఆంధ్రవాణి!

ఉ. ఱాలుకఱుంగగా విమలరాగము లాలపనంబు సేయుగో
పాలుడవీవు; నీ అమృత వాహినిలోని తరంగ బాలికల్
పూలకు ప్రేమనేర్పినవి; భూమివడంకిన దోయి తిక్కనా!
కాలము దాటనిమ్ము నినుగాదని ఎవ్వరికిత్తు మొక్కులన్.

—ఆ. సీతారాముడు.

# భావతరంగిణి   

"నిర్మాణ కార్యక్రమమును బాగుగా నాచరించుచో మనము గమ్యస్థానము చేరుదుము. మనకు కావలసినది సంఖ్య కాదు. కొద్దిమంది యున్నను వారు నికరమైనవారుగా నుండవలెను. గుణముగలవారనేకులున్నచో మరింత సంతోషము."

—మహాత్మ గాంధి

♦ ♦ ♦ ♦

"విదేశబట్ట, విదేశభాష మనకు భారమైనవి. మన ఖద్దరు మనస్వతంత్ర చిహ్నమెట్లో హిందీ అభ్యసనము మన నూతన వ్యవస్థకు సూచన అగుచున్నది. విదేశ భాషను నేను ద్వేషించుటలేదు. బలవంతముగ మనపై త్రోయబడినపుడు అది మనకు బాధయగుచున్నది. ఖద్దరు ధరించుట ఎట్లు అలవరచుకొనుచున్నామో, హిందీ మనోభావమును అట్లే నలవరచుకొనవలెను. ఖద్దరు మన గ్రామ పరిశ్రమ పునరుద్ధరణ కెట్లు తోడ్పడునో మన హిందీ మనోవృత్తిగూడా మన విజ్ఞానఖనిజముల బయటబెట్టగలదు. ఖద్దరు కట్టిన దేశభక్తునికి హిందీరానిచో ఎంత అవమానముగ నుండునో, హిందీవచ్చినవానికి ఖద్దరు కట్టనిచో అంత సిగ్గుగ నుండును. హిందీ, ఖద్దరు విడదీయరానివి. అట్లే అవి మద్యపాన నిషేధముతోనూ, అస్పృశ్యతా నివారణతతోనూ, హిందూముస్లిం ఐక్యతతోనూ అవిభాజ్యమైనవి. ఇవి అన్నియుకలసి ఒక పరిపూర్ణ స్వరూపము గలవగును. అనగా నిర్మాణకార్యక్రమమునందు మీరు మునిగి తేలవలసియున్నది."

—డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య

♦ ♦ ♦ ♦

"నిజంగా విజ్ఞానం అలవర్చుకోటానికి భారతం తప్పకుండా తెలుసుకోవాలి. భారత రామాయణాలు చదువని చదువు, చదువుకాదని నా నమ్మకము. దానికి మించిన జ్ఞానాభివద్ధి మరిలేదు. మీరు కుట్టు పనులు, ఆటపనులు మున్నగువాటిలో ఎంత అభిరుచి కన్పరుస్తున్నారో అట్టి ఉత్సాహామే భారతపఠనములో కూడ చూపి విజ్ఞానమలవరుచుకోవాలి. మనహిందూజాతిలో ఎందరెందరు ఎన్ని సిద్ధాంతాలు చెప్పారో అన్నీ భారతములో ఉన్నాయి. సుమారు 4 వేల యేండ్లనుంచి వేయి సంవత్సరముల పర్యంతము చేసిన పనులూ, ఆధ్యాత్మిక విషయాలూ, వాళ్ల ప్రతిభా విశేషాలూ అన్నీ మిళితమయినయి భారతంలో. ఇంకా మనుష్యునికి ప్రయత్నాల్లో ఉత్సాహమూ కలిగేటట్లూ, ఆపదలలో ఉపశమనము కలిగేటట్టుకూడా చిత్రించేది భారతం! దాన్ని మీరంతా వచనంలోనైనా తప్పక చదివి విజ్ఞానాభివృద్ధి చేసుకోవాలి"

—డా॥ కట్టమంచి రామలింగా రెడ్డి

♦ ♦ ♦ ♦

"పురుషులు తమ హక్కులను తొలగించిరి, అణచియుంచిరని ఫిర్యాదుచేసి లాభములేదు. మనమే వారి ఆధిక్యత నంగీకరించి తలయొగ్గియున్నాము. నైతికాధ్యాత్మికశక్తి మనలో గలదు. మనం తలచుకుంటే యీ ప్రపంచాన్ని ద్వేషం దౌర్జన్యంనుండి బయటకు తీయగలం. యుద్ధాలవలన ద్వేషం వినాశం తొలగదు ప్రపంచంలో దౌర్జన్యాన్ని సహించి మనం ఆత్మలను పోగొట్టుకొనుచున్నాము. దేవుడు మనకు గాంధిమహాత్ముని ప్రసాదించాడు. భారత స్త్రీలందరు తమ శక్తినంతను వినియోగించి, వారికి మనఃస్ఫూర్తిగ తోడ్పడి అస్పృశ్యత తొలగించుటకును, శాంతి నెలకొల్పుటకును పాటుపడవలెను."

—రాజకుమారి అమృతకార్

# నా సీత

"పంతుల"

సీతాదేవి ఓ మధుర విపంచి; తీయని భావంగల దివ్యసుందరి. ఆకాశంమీద తోచే మబ్బుతునకల్లోని గరగరలూ, వాన కారులో వొచ్చే విద్యుల్లతల జిగజిగలూ, ప్రశాంతమైన, గంభీరమైన కొలనినీటిలో నిగనిగలు, వనగర్భంలో జాలుగా పూచే సన్నజాజిపూవుల ఘుమఘుమలూ, తళతళలు ఆమెలో ధన్యత్వం పొందాయి. ఆమె పువ్వుల నవ్వులో వెన్నెల్లు ఒలుకుతాయి. ఆమె చూపులో సుధాచంద్రికలు ప్రసరిస్తాయి——

ఈ లోకంలో సీతాదేవి మహతీగానం లేతవయసులో మూకపోయినా, ఫలవంతం పొంది, మరపురాకుండా నేటికీ - ఏనాటికీ - వినిపిస్తూంది; వినిపించాగలదు. ఆ గానము పరిమళాన్ని గంధవాహం తనలో విలీనం చేసుకొంది. తొలిపూతలోనే మాలతీలత విలయాతపానికి లొంగిపోయింది. మొదటి పంటతోనే దానిమ్మ ఝుంఝూమారుతానికి ఆహుతయిపోయింది. ఝురీకుమారి తొలకరి వాగుకే నిప్పులుకురిసే నిదాఘానికి నిలువు నిపాతం మొండిపోయింది.

సీతాదేవి, మూన్నాళ్లముచ్చటగా అన్ని పాటలూ పాడి, అన్ని ఆటలూ ఆడి, కాలం పొత్తిళ్లలో సుఖంగా, ఆనందంగా, హాయిగా నిద్రపోయింది. ఆమె జీవితరజనికి అపరిమిత వ్యాధి ఓ కోడికూత. సీతాదేవిని తీయని పూవుల్తో పూజించే పెనిమిటి మెత్తని చిత్తంలో ఆరనికొలిమి జొనిపింది పాడుకాలం.

తడియారని నాలుకతో యిలా జీవితంలోని వివిధ సంఘటనల్ని తలచుకొని, విషాదంగా విలాపిస్తున్నాడు భర్త.——

ఇదీ కథావస్తువు. నేటికి కథే. ఆనాటికి నిజం, అనుభవమున్నూ——

## నా సీత

నాసీత;——బంగారు నాడెంపు బొమ్మ;
నా జీవ సంజీవి, నా చైత్రలక్ష్మి,
జవము, జీవము నాకు సంధించు శక్తి,
మన్మనోసామ్రాజ్య మహనీయరాజ్ఞి,
నవ్యశోభాత్తమా నా కళావాణి,
నాకీర్తి, నాయెద, నాప్రేమ పేటి,
నా నిండుగర్వమ్ము, నాకంటివిందు,
కష్టభాజనమైన కారుచీకట్ల
కిరవైన నాదీన హృదయవాటికను
కలకల మనిపించు గాటంపువెలుగు——
నాసీత——

## ఆమె

కన్నెగులాబీల కన్నక్రొంజాయ,
మేలు మంకెన నేలు మెత్తందనమ్ము
నాసీత జిగిమోవి——నాముద్దు దీవి;
మల్లెమొగ్గల కూర్పు, చల్లందనంబు
తరళహారము, చిన్ని దంతాలవరుస;
పాలబుగ్గను దోచు పవడంపులొత్తు
మోమునకొకయందమును సంఘటింప,
లోలనీలాలక మావికారుచిర
ఫాలభాగాన శుభప్రదమ్మైన
కుంకుమాంకము క్రొత్త పొంకమ్ము గొలుప,
తీర్చి, దిద్దినయట్టి తీరైన బొమలు,
నిడుదలై, సోగలై, కడుముచ్చటైన

కాటుక కండ్లకు నీటు సంధింప,
మురువు ముంజెవులను ముద్దులోలకులు
ప్రేలాడి, తొట్రిలి, చాలాకి నడగ,
నవ్వుల పువ్వులో—నగవు వెన్నెలలో
కుమ్మరించును మోముదమ్మియెల్లపుడు;
సీతవేనలికారు చీకట్ల గుంపు,
ఘనఘనాఘనములో గల కప్పునిగ్గు;
సీతగిరుక్కున చీకట్లు చెదరి
తనుకాంతి పుంజాన దల్లడిలిపోవు;
కుసుమజాలముకన్న కోమలత్వమ్ము,
మెఱపు దీవియెకన్న మెఱుగుందనమ్ము
సాంద్ర చంద్రికకన్న చక్కందనమ్ము
లావు సన్నము గాక లావణ్యగరిమ,
పొడవు పొట్టియు లేక ముద్దారులీల,
కనుపండువొనరింపగలదామె తనువు;
ప్రాభాతవాయువు, పరమశుద్ధాత్మ
మంచి ముత్తెపుపూస మంచుక్రొంజినుకు,
తొలివాన నెత్తావి కొలని కెందమ్మి
ఆ లోలపుష్పిత మాలతీలతిక,
నవకంపు నునుమిన్కు పవడాలరాసి,
ఆమంజువిగ్రహం బాదివ్యమూర్తి;
ఆ సుధామధురోక్తి లాక్రమభావ
మా నిరాడంబరమైన వర్తనము
చెలువంపు దొడవులై విలువ గల్గించు;
సీత రూపమ్ము నాచేతోముదమ్ము
సీత-మేనొందిన జిలుగు చిత్తరువు,
సీత, సీతాశోక చిన్నారిచిలుక.

## ఆనాడు

ఆనాడు నాజన్మ కేనాడురాదు;
మరువలే నానాటి మహనీయదశను.
ఆనాడు శుభలగ్నమా మందిరాన
జరుగును నాసీత పరిణయోత్సవము.
ముంగిట చప్పరమును తోరణాలు,
పసుపు కుంకుమతోటి పన్నెగుమ్మములు,
ముత్తెంపుముగ్గుల మురుపువాకిళ్లు
కన్నుల పున్నెంపుగాటంపు పంట—
ఆనాడు నాజన్మ కేనాడురాదు;
మరువలే నానాటి మహనీయదశను.
ఆ బాలగోపాల మానందపూర్ణ
హృదయ పద్మాలతో నెన్నెన్నొ గతుల,
విసుగైననొందక, వేసటేగనక,
స్వైర విహారమ్ము సలుపునాయింట;
ఆనాడు నా జన్మ కేనాడురాదు;
మరువలే నానాటి మహనీయదశను.
సర్వతోముఖ నవ్య సంతోషరాగ
కళలతో నాబాల - కళ్యాణ చిహ్న
భాసమానలలాట ఫలకార్ధచంద్ర—
తెలియని నునుసిగ్గు తెరలకందోయి
అద్దాల చెక్కిలి నంగారుచుక్క—
దోబూచులాడుచు తొణకు చిర్నగవు
పసుపుపూసిన మేల్మి బంగారుతనువు
చిటిపోకల యెదంజిలుగు పయ్యెంట
పారాణికై సేయబడియున్న, రత్న
మంజీరభూషిత మంజుపాదములు,
బంధుజాలము మెప్పుబడసి, చెన్నార
ఒకవింత, ఒకశోభ, ఒక విలాసమ్ము
గొలుపుచు, తనచుట్టు గుమిగూడి పెద్ద
ముత్తైదువలు హర్షమున దేలియాడ,
అల్లన నాచెంత నాసీనయగుచు
ప్రేమతో మనసార ప్రేమవరించె,
ప్రేమైకజీవిని, ప్రేమస్వరూపి,
ఆనాడు నాజన్మ కేనాడురాదు;
మరువలే నానాటి మహనీయదశను.

(ఇంకా "నాసీత")

# దేవదాసి

శ్రీ ఎచ్చెర్ల జయప్రసాదరావు

## ● వ్యభిచార నిర్మూలనము, అనాధ స్త్రీ, శిశుసంరక్షణలకు శాసన సహకారమును నిర్మించవలసిన ఆవశ్యకత ●

దేవ అనగా దైవమనియు, దాసి అనగా సేవచేయునది అనియు, కరుణాకరుని సాన్నిధ్యమున కుంభారతులిచ్చే కళావతి దేవదాసి యని మనపూర్వులు చెప్పుట వాడుక. కాని రానురాను దేవదాసి ధ్వంస దేశిగా మారి, దుర్నయము అమలులోపెట్టి, దుష్ప్రవర్తనములకు కంకణముకట్టి కండ్లార కావించుకొన్న కళ్యాణములను కూకటివ్రేళ్ళతో పెకళింపచేస్తూ, భార్యాభర్తలకు వియోగము కల్గించుచున్నది. ఎంతమందియో దుర్వ్యసనములకు పాల్పడి, త్రాగుడు మొదలగు దుర్వ్యసనములకు లోనై కండ్లుకానక, అగ్నిదేవతసాక్షిగా భార్యమెడలో కట్టిన పుస్తెలను సయితము అమ్మి, భార్యను భిక్షకురాలుగా చేసి, బిడ్డలను అనాధులుగాచేసి, ఉద్యోగములకు ఉద్వాసనములిచ్చి కడకు కూటికిలేక, బట్టకులేక బైరాగులైపోవుచున్నారు.

నిజముగా యీ సంఘముయొక్క స్థితి చాలా దుస్థితిలో నున్నదనుటకు ఏ సందేహము లేదు. అంట రాని అధములు మాలలని కొంతమంది పెద్దలు వాదింతురు గాని మాలలకన్న నీచులు దేవదాసీలని నిశ్చయముగా చెప్పవచ్చును. దేవదాసీలే గాదు. ఎవరు వ్యభిచారిణిగా వ్యవహరింతురో వారు ముమ్మాటికి మాలలకన్న నీచులు. మాలలు మర్యాదగా కాయకష్టముల కోర్చి, కష్టపడి సంసారికముగా కొంతమంది జీవనము చేయుచున్నారు. గాంధీమహాత్ముని అస్పృశ్యతానివారణోద్యమముచే హరిజనులకు అన్ని ఆఫీసులలోను ఉద్యోగములిచ్చుచున్నారు. ఎన్నోవేల సంవత్సరములనుండి మాల మాదిగలకు తెరువని దేవాలయములు నేడు నిరాటంకముగా, నిర్భయముగా తెరువగలిగినారు. యీ సామర్థ్యము, యీ శక్తి, యీ కళావంతుల సంఘములలో ఎందులకుండగూడదు ?

వీరి మానసమర్యాదలుగూర్చి, స్వాతంత్రములగూర్చి, సంఘాభివృద్ధులగూర్చి, విద్యాభివృద్ధులగూర్చి, వృద్ధాప్యములోగూడ రాత్రి, పగలు చలించుచున్న డా॥ శ్రీమతి ముత్తులక్ష్మమ్మ సతిగారికి, హీనమగు వ్యభిచారమును విసర్జించి, సంఘాభివృద్ధికై సహకారమును ఇచ్చుట కళావంతుల ముఖ్యధర్మము.

ఈ వ్యభిచారము దేవదాసీ సంఘీయులలోనే గాక, ప్రతి జాతిలోను, ప్రతి సంఘములోను ప్రబలుచున్నదనుటకు సందేహములేదు. సిగ్గుచే చింతిల్లుచున్న ఒక స్త్రీయొక్క 'అవస్థ' ఆ దేశములో నున్న ప్రతి మానవునియొక్క 'అమర్యాద' యనుట అతిశయోక్తి కాదు.

ప్రపంచమంతటిలో పాతివ్రత్యమునకు ప్రఖ్యాతిగాంచిన యీ హైందవ సామ్రాజ్యము నేడు గావింపబడుచున్న యీ వ్యభిచారము మూలమున నీచస్థితిలో నున్నదనుటకు ఏ సందేహము లేదు.

దేవదాసీలు హీనమగు వ్యభిచారముకొరకే పుట్టినారనియు, యీ సంఘమువారు తమ యౌవ్వజీవము, మానము విక్రయించి, వినోదస్థులతో విహారము సల్పుదురనియు వాదించుట ముమ్మాటికి పొరపాటు.

మన సంఘీయులలో ఒక్క పరపురుషుడు ఆడువారిని ఏమైన వినోదముగా ప్రశ్నించిన మనకు కోపమువచ్చుటలేదా! ఆ రీతిగానే ప్రతి భారతీయ సోదరుడు గ్రహించి, హిందూధర్మ మవలంబించి, యీ దేవదాసీ సంఘీయులలో నున్న దాసీలకు సంసారికమైన ఒక నూతనమార్గము ఏర్పరుపవలసియున్నది.

ఇంగ్లాండు దేశములో శాస్త్రరు చట్టము ప్రకారము, అనాధయైన బిడ్డల తల్లికి కొంతడబ్బు, బిడ్డల చదువుగూర్చి తండ్రి యివ్వవలసినదని తెల్పుచున్నది. కొన్నిదేశములలో యీ అనాధ బిడ్డలగూర్చి గవర్న మెంటువారు ముఖ్యమైన జాగ్రత్త తీసుకున్నారు. యింకా కొన్నిదేశములలో వ్యభిచారిణి, వ్యభిచారము అన్నమాట చట్టము మూలముగా రద్దుచేయబడది. జర్మనీలోను, ఇటలీలోను యీ బిడ్డలను తల్లితండ్రియొక్క జాగ్రత్తలో నుంచక, 'వెల్ ఫేరు బోర్డ్సు' వారి కట్టుదిట్టములలో నుండుటకు చట్టము అమలులో నుంచ బడినది. యింకా జర్మనీలో బిడ్డలయొక్క తండ్రులను కనుగొనుటకు రక్తపరీక్షలుకూడా నడుచుచున్నవి.

సర్వదేశములు సభ్యతతో క్రొత్త సోయగములీనుచున్న యీ యిరువదవ శతాబ్దములోగూడ మన భారతభూమి యందిట్టి నీచాచారములుండుట సిగ్గుచేటు.

కొన్నికొన్నిచోట్ల యీ కళావంతుల సంఘములలో కొన్ని కట్టుదిట్టములు సమకూర్చబడినను, యింకను కొన్నిచోట్ల యిది విపరీత వ్యాప్తిలో నుండుట శోచనీయము.

దీనికి సాంఘిక సేవాపరులు వెంటనే పూనుకొని, పరదేశములయందున్న చట్టముల నమలులోనికి తీసుకువచ్చినగాని, మనము సభ్యతాప్రపంచమున స్థానమును పొందజాలము.

# కడుపులో బొత్తిగా ఆహారము లేనప్పుడుకూడా రోగి ఆహారము వద్దనును

మలేరియా జ్వరపీడితుడు ఏ ఘన ఆహారము తీసుకోలేకపోవడమే ప్రమాదమునకు కారణము. జ్వరపు విషముచే నిర్బలమైన నరస్నాయువులకు తిరిగి శక్తిని చేకూర్చుటకు పుష్టికర ఆహారము అత్యావశ్యకము. ఆహారము అగత్యమైనప్పుడు కడుపు బలహీనముగా నుండుటచే ఆహారము జీర్ణమవదు.

ఇట్టి స్థితిలో డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫారసు చేయుదురు. ఇది వందకువంద పుష్టి నిచ్చునది. జీర్ణశక్తికి ఏలాంటి హాని కలుగజేయక సులభముగా జీర్ణమైన రస్నాయువులకు పూర్వపు పటుత్వము కలుగజేయును. తేర్గడ కాలమందు ఇతర రోగాదులు రాకుండ రక్షించును.

మలేరియా మృత్యువునుండి తప్పించుకొన్న వేలకొలది జనులు హార్లిక్సు సేవనచే స్వల్పకాలము లోనే దేహదారుఢ్యమును పొందియున్నారు.

★
★★

# కఠిన హృదయాలు

— శ్రీ —
వై. రామమూర్తి

★★
★

అది సాయం సమయం. హిందూస్థానీ స్త్రీ పురుషు లిద్దరు ఒక హైరోడ్డు ప్రక్కను కూర్చుని హార్మోనియంతో పాటలుపాడుతూ భిక్ష మెత్తుకుంటున్నారు. సమీపములో ఆ హైరోడ్డు ప్రక్కనేవుంది రెండంతస్థుల భవనం. ఆ మేడ మొదటి యంతస్థు వీధివైపు వరండాలో తిరుగుతూ, ఏడుస్తూవున్న చంటి బిడ్డను బుజ్జగిస్తూ వున్నదా గృహిణి. ఈమె వైపు బడింది ఆ అనాథుల దృష్టి.

గేటుదాటి లోనికి ప్రవేసింపగానే హార్మోనియంవేయటం మొదలు పెట్టాడు. దానితోపాటు గొంతుక కలుపుచూ, వినసొంపుగా బంగాలిస్టైల్లో పాడుతూవుంది అతను వెంటనున్న యువతి. త్రోవపోయేవారు అందరూ ఆ గేటుదగ్గరనే ఆగిపోయారు ఆకోకిల గానం వింటూను. పైనుండి తల్లి పిల్లాడు నిశ్చేష్టులై వింటూవున్నారా పాటలు.

ఇంతకుముందే ఆమెభర్త డ్యూటీనుండి కారులోవచ్చిన డాక్టరు సూటు, బూటు, హేటు దీసి అటుపెట్టి మిద్దెమీద వీధి వరండాలోనికి వచ్చినాడు జోరుగ. "యేం అలానిలబడ్డావ్? వాళ్లని పొమ్మని చెప్పకూడదు?" అన్నాడు భార్యతో. వాళ్లను అంతకుముందే వెళ్లిపొమ్మని చెప్పదామనుకుంది కాని, ఆపాటలు వినసొంపుగా వుండటంచేత పొమ్మనటానికి నోరు వచ్చిందికాదామెకు. చివరకు అతడే "ఛా-ఛా" అని రెండుసార్లు తలవిసురుతు కోపంతో అన్నాడు.

తల్లిదగ్గిరున్నా పిల్లాడు తాను తింటూవున్న చేతిలోని బిస కత్తు ముక్కను ఆబిక్కముఖం వేసుకొని చూస్తూవున్న అనాథుల వైపు విసిరాడు జాలి చూడ్కులతో. "అలాగే చూస్తున్నావేం వాళ్లవంక, రా-పద" అంటూ అక్కడనే నిలబడివున్న భార్యను చెయిపట్టి లోనికి లాక్కుపోయాడు డాక్టరు. పిల్లాడు విసిరేసిన ఆ బిసకత్తుముక్క క్రిందపడకుండగా ఆతురతతో అమృతంలాగందు కున్నారా అభాగ్యులు—యిదే ఆ కఠిన హృదయాల కనికర ప్రసాద మని యెంచి—దాంతో తృప్తిపడుతూ—




పిన్ని ఉత్తరాలు

# ఆర్యావర్తము

సర్వమంగళా,

మైసూరు రాజ్యాన్నిగురించి నీకు ఓ ఉత్తరం రాశా. అప్పుడు మైసూరు, పీఠభూమిలో ఉందని చెప్పేను. ఈ మైసూరుకు ఉత్తరంగా ఉన్న దత్తమండలాలు, వాటికి ఉత్తరంగాఉన్న హైదరాబాదు సంస్థానం, అదికూడా దాటి ఇంకా ఉత్తరంగాపోతే వచ్చు మధ్య పరగణాలూ-ఇవన్నీకూడా పీఠభూమిలోవే.

ఈ పీఠభూమికి 'దక్కన్' పీఠభూమి అని పేరుపెట్టేరు. 'దక్కన్' అంటే 'దక్షిణం' అన్నమాట. హిందూదేశాన్ని ఉత్తరభాగమనీ, దక్షిణభాగమనీ రెండుగా విభజనచేసి చూస్తే, ఆదక్షిణభాగంలో ఉంది ఈ పీఠభూమి. ఈ పీఠభూమీ, దీనికి తూర్పున ఉన్న తెనుగు, తమిళ ప్రాంతాలూ, పడమటగా ఉన్న మళయాళం, బొంబాయి ప్రదేశాలూ-వీటి నన్నింటినీ కలిపి 'దక్షిణాపథం' అంటారు. గోదావరి, కృష్ణా, కావేరి మొదలైన నదులూ, 'తూర్పుకనుమలూ పడమటి కనుమలూ'అని పిలవబడే కొండలూ-ఇవన్నీ 'దక్షిణాపథం'లోవే.

మనదేశంలో ఉత్తరభాగాన్ని 'ఆర్యావర్తం'అని పిలుస్తారు. దక్షిణాపథంకంటే, ఆర్యావర్తం చాలా సారవంతమైన ప్రదేశం. అక్కడ, ఇక్కడవుమల్లే పీఠభూమిలేకుండా నేలంతా సమతలంగా ఉంటుంది. దక్షిణాన్ని ఉన్న నదులకంటే చాలా పొడుగైన గొప్ప నదులున్నాయి, ఆర్యావర్తంలో. సింధునది, గంగానది, బ్రహ్మపుత్రానది-ఇవన్నీ ఆర్యావర్తంలోవే. ఈ నదులన్నీ హిమవత్పర్వతాల్లో పుట్టి అక్కడి మంచి ఒండ్రుమట్టిఅంతా తెచ్చి ఈ సమతలంలో పరుస్తున్నాయి. అందుచేతనే ఈ ప్రదేశంలో పంటలు బాగా పండుతాయి. తినడానికి సమృద్ధిగా పండుతుంది గనకనే ఈ సమతలంలో జనంకూడా చాలా ఎక్కువగా ఉంటారు. బెల్లమున్నచోటికి చీమలు చేరతాయి చూడు. అలాగే మనుషులూను!

ఆర్యావర్తం చాలా సారవంతమైన దేశం గనకనే, ఇతర దేశాలవాళ్లు ఎంతోమంది ఈ దేశానికి దండెత్తి వచ్చారు. మహమ్మదీయులు మనదేశానికి ఇలావచ్చినవాళ్లే. మహమ్మదీయ నవాబులూ, అంతకు ముందు రాజ్యంచేసిన హిందూరాజులూ ఈ దేశంలో అన్నిచోట్లా పెద్దపెద్ద పట్టణాలు నిర్మించారు. లాహోరు, ఢిల్లీ, అలహాబాదు, కాశీ, లక్నో పాటలీపుత్రం—ఈ పట్టణాలన్నీ మనం ఎప్పుడో వెళ్లి చూడాలి. కలకత్తానగరంకూడా ఉత్తరదేశంలోదే. ఈ నగరం కడత, ప్రస్తుతం పాలిస్తోన్న తెల్లవాళ్లు

వచ్చిన దరిమిలానే. ఈ నగరాలన్నింటిలోనూ గొప్పగొప్పభవనాలు, రాచనగళ్లూ, కోటలూ, స్థూపాలూ, మసీదులూ, ఒకటేమిటి, చూడదగినవి ఎన్నో ఉన్నాయి. ఒక్కొక్కదాన్నిగురించీ ముందుముందు ఉత్తరాల్లో రాస్తా.

ఉత్తరదేశంలో ఉన్న నదులన్నీ హిమవత్పర్వతాల్లో పుట్టేయని కదూ చెప్పేను? ఈ హిమవత్పర్వతం చాలా ఎత్తైన పర్వతం. దీని శిఖరాలన్నీ మంచుతో నిండి ఉంటాయి. 'హిమం' అంటే 'మంచు' అన్న మాట. 'హిమవత్పర్వతం' అంటే 'మంచుకొండ' అని అర్థం. ఈ పర్వతాలలోనే పార్వతీదేవి పుట్టింది. పర్వత రాజు కూతురు గనకనే ఆవిడను 'పార్వతి' అని పేరొస్త. ఈశ్వరుడు తపస్సు చేసుకున్న కైలాసపర్వతం ఈ హిమవత్పర్వతాలలోదే. ఆయన అక్కడ తపస్సు చేసుకుంటూంటే పార్వతీదేవి రోజూ ఆయనను పూజకోసం పువ్వులూ అవీ తెచ్చి పెడుతోండడం, ఆవిడ భక్తికిమెచ్చి ఈశ్వరుడామెను పెళ్లి చేసుకోడం, ఈ కథంతా నీకు తెలుసు కదూ?

ఆర్యావర్తం చాలా పుణ్యభూమి. మన పురాణాల్లోవచ్చే ఋషులంతా ఇక్కడే పుట్టేరు. రామాయణంలోవచ్చే దశరథుడూ, రాముడూ-వీళ్లందరూ ఆర్యావర్తంలో వాళ్లే. శ్రీ కృష్ణుడూ, పాండవులూ—వీళ్లంతాకూడా ఇక్కడివాళ్లే. హర్షుడూ, చంద్రగుప్తుడు, అశోకుడు మొదలైన హిందూ చక్రవర్తులు, తర్వాతవచ్చిన అక్బరు మొదలైన మొగలాయి చక్రవర్తులూ, గౌతమబుద్ధుడులాంటి మహాపురుషులూ, ఎంతో మంది ఆర్యావర్తంలో జన్మించారు. కనుక మనదేశంయొక్క చరిత్ర అంతా ఈ భాగంలోనే ప్రారంభమైందన్నమాట.

'దక్షిణాపథం'లో మైసూరు, హైదరాబాదులాంటి స్వతంత్ర రాజ్యాలున్నాయని ఓమాటు రాశాను. ఇలాంటి స్వతంత్రరాజ్యాలు ఆర్యావర్తంలోకూడా ఉన్నాయి. ఇవి మినహాయించగా మిగిలిన ప్రదేశాన్ని అంతనూ ప్రస్తుతం తెల్లవాళ్లే పాలిస్తున్నారు. దేశాన్ని రాష్ట్రాలుగా భాగించి ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క గవర్నరునుపెట్టి రాజ్యం చేస్తున్నారు తెల్లవాళ్లు. ఈ రాష్ట్రాలలో ఒకటి వంగ దేశం. మళ్లీ ఉత్తరంలో నీకు వంగరాష్ట్రాన్ని గురించిరాస్తా.

చెన్నపట్నం,
1—2—1941

పి న్ని.

# గృహలక్ష్మి లొక్కు పలుక్కులు

పళ్లోపళ్లు
ఏం! పళ్లు?
మిరపపళ్లు
ఏం! మిరప?
అడవి మిరప,
ఏం! అడవి?
కారుఅడవి!
ఏం! కారు?
క్రొత్తకారు!
ఏం! క్రొత్త!

మాట క్రొత్త
ఏం! మాట?
మంచి మాట!
ఏం! మంచి?
నడక మంచి!
ఏం! నడక?
హంస నడక
ఏం! హంస?
రాజహంస
ఏమి రాజు?

మృగరాజు!
ఏం! మృగము?
పచ్చ మృగము
ఏం! పచ్చ?
పసుపు పచ్చ
ఏం! పసుపు?
కొమ్ము పసుపు!
ఏం! కొమ్ము?
దూడకొమ్ము!
ఏం! దూడ?

ఆవుదూడ;
ఏం! ఆవు?
తెల్ల ఆవు;
ఏం! తెల్ల?
మోము తెల్ల?
ఏం! మోము
లక్ష్మి మోము
ఏం! లక్ష్మిం
గృహలక్ష్మి.

—పిల్లా పాపమ్మ.

# బంగారము చేర్చబడిన చ్యవనప్రాశ

సాధారణ చ్యవనప్రాశగుణములు - గొప్పరసాయన గుణముకలది. మంచి ఓజస్సును ఇచ్చును. క్షయకాస ములలో అత్యంత ఉపయోగమైనది.

1 పౌను వెల రు. 5

# బిల్వాది లేహ్యము

వమనము, హృద్రోగములు, కామిల, గుల్మము, అజీర్తి విరేచనములు, అరుచి, పీనసము, ఎక్కిళ్లు, దగ్గు, క్రిములు, ఉబ్బసము, ప్లీహావృద్ధి, కడుపుబ్బరము, రక్తక్షీణత లనుపోగొట్టును. మరియు విషదోషములను హరించును.

వెల ½ శేరు రు. 1

# కూష్మాండ లేహ్యము

ఈ లేహ్యము రక్తపిత్తము, క్షయ, జ్వరము, దాహము, పైత్యము, వాంతి, దగ్గు, అజీర్ణములను కుదుర్చును. జీర్ణశక్తికి తగినట్లు ఔషధమును సేవింప వలెను. ఈ లేహ్యము పసిపిల్లలును, వయసుమీరిన వారును ముఖ్యముగ ఉపయోగింపదగినది. మరియు సంభోగేచ్ఛయు పుష్టియు కలిగించును. కాడ్లివ రాయిలుకంటెను మేలైనగుణము లీలేహ్యమువలన కల్గునని మా యనుభవముపై తెలుపుచున్నాము.

వెల 1 పౌను రు. 2 8   ½ పౌను రు. 1 8   ¼ పౌను రు. 0 13

# మదనకామేశ్వరి లేహ్యము

శుక్లనష్టము, శీఘ్రస్ఖలనము, దుర్బలేంద్రియము, అజీర్తి, దగ్గు, కొరవడిన సంభోగశక్తితో దుఃఖభాజన మైన జీవనముగడుపువారికి మంచిశక్తి, బలము, సంభోగవాంఛ నీయగలది.

వెల 1 పౌను రు. 10   ½ పౌను రు. 5   ¼ పౌను రు. 3

**కేసరికుటీరం - మద్రాసు**

## ★ మానవతి

● శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మ

రామారావుగారి కాపురం బెజవాడ. ఎక్కువ గొప్పవారు కాకపోయినప్పటికి సామాన్యులలో స్థితిపరులు. రామారావుగారికి బెజవాడకోర్టులో నెలకు నలభైరూపాయల ఉద్యోగం. వీరికి ఏడుగురు కొమార్తెలు ముగ్గురు కొమాళ్లు. పెద్దకొమార్తె రాజేశ్వరి. రామారావుగారిభార్య సీతమ్మ. అల్లుండ్ల రాకపోకల మురిపములు తీర్చుకొనవలెననే కోరికతో శారదాబిల్లు హడావుడిలో తమ ఇంటివెనుక మాధవరావుగారి కొమారుడికిచ్చి పెండ్లిచేశారు రాజేశ్వరికి. వారు సామాన్యస్థితిపరులే. పిల్లవాడు ఏదో చిన్నచదువు చదువుతున్నాడు. పెండ్లి అయినదిమొదలు ఏదో పేచిపెట్టడమేగాని ఒక్క పండుగకైన అత్తవారింటికి వచ్చి ఎఱుగడు రాఘవరావు. తరువాత సంవత్సరములోపల తీసుకరావలెనని పెండ్లికిచేసినంత ప్రయత్నముచేసి బంధువులను పిలచి అల్లుడిని రమ్మనిపిలిస్తే రానని అలిగాడు. కారణం అడిగితే. మోటారుసైకిలిస్తేగాని రానని కబురు. వీరికి వక్క అల్లుడుకాడు అడిగినదల్లాయివ్వడానికి. ఇవ్వలేక ఊరుకున్నారు. తరువాత మళ్లీ పండుగలకు పిలచినా కార్యకరామతులకు పిలచినా గుమ్మంలోకివచ్చి ఎఱుగడు. అల్లుడురాకుండా బెట్టుచేస్తే అడిగినదల్లా ఇస్తారనికాబోలు అతని అభిప్రాయం.

♦ ♦ ♦ ♦

రాజేశ్వరి పెద్దదైన రెండునెలల తరువాతనుంచి పంపమని మొదలుపెట్టారు అత్తవారు. ఏలాగో విశ్వప్రయత్నముమీద తరువాత ఆరునెలలు గడచినాయి. ఒకరోజు అల్లుడు కబురుచేశాడు 'ఈరోజు పిల్లను పంపితే సరే—లేకపోతె నేను రెండోపెండ్లి చేసుగుంటాను' అని.

రామారావుగారు చాలా మరియాదగలవాడు, గుణవంతుడు, బంధుప్రియుడు, జాలిహృదయుడు. ఈ కబురువినగానే హడలిపోయి పంపేశాడు.

♦ ♦ ♦ ♦

రాజేశ్వరి పదునాల్గేండ్లపిల్ల. పచ్చని పసిమిచాయ కన్నుముక్కు తీరుగలది. సామాన్యమైన తలకట్టు. పొట్టిగకురుచగా సామాన్యమైనపిల్ల. సంగీతము, కుట్లు, అల్లికలుఅన్నీ నేర్చుకున్నది. చాలానిదానం. మిక్కిలి వోర్పుకలది. పదిమాటలకు వక్కజవాబుకూడా చెప్పదు. సద్గుణములరాసి అని చెప్పాలి ఆపిల్లను. రాజేశ్వరి అత్తవారింటికివెళ్లి సంవత్సరమైంది. పంపమని ఎన్నితఫాలు అడిగినా పంపరు. ఇక రాజేశ్వరి దినచర్య స్థితి రోజు తలదువ్వుకోకూడదు, పువ్వులుపెట్టుకోకూడదు. పువ్వులుపెట్టుకుంటే భోగంవాళ్లతోసమానం. చెల్లెండ్రు ఎప్పుడైనా వస్తే అందరి ఎదుటమాట్లాడి పంపవలసిందేగాని ఏకాంతముగా మాట్లాడకూడదు. ఇంట్లో చదువుకొనుటగాని, అల్లుకొనుటగాని, పాడుకొనుటగాని అసలే పనికిరావు.

♦ ♦ ♦ ♦

సంక్రాంతి పండుగవస్తున్నది. పిల్లలంతా బొమ్మలు పెట్టుకుంటూ మంటున్నారు. రాజేశ్వరినికూడా తీసుకురావలెనని రామారావువెళ్లి పిన్నపెద్దల చేత చెప్పించి పండుగరోజు పంపుతాము అని వప్పించుకుని

వచ్చారు. తెల్లవారింది, ఆగోజె పండుగ. తొలకరి మెరపులాగ దొడ్డిగుమ్మంలో మెరసింది రాజేశ్వరి. తల్లీ అమ్మమ్మా పరమసంతోష భరితులైనారు. చెల్లెండ్రువచ్చి కౌగలించుకున్నారు 'సుశీలా! ఎందుకిల్లా నన్ను చుట్టుకుంటారు? నేనుండేది కొన్నిగంటలే కదా?' అని ముఖం చిన్నపుచ్చుకున్నది రాజేశ్వరి. అందరు తలంట్లు పోసుకున్నారు. అమ్మమ్మ వంటచేసింది. తరువాత కొంచంసేపటికి టైముచూచి అమ్మమ్మా నేను వెళ్లుతాను అన్నంపెట్టు అన్నది. 'మీ నాన్నగారు ఇంటికొచ్చి చూచిందాకా నైనా ఉండవా? రాజేశ్వరీ! చెల్లెండ్రు బొమ్మలుపెట్టుకున్నారు సాయంకాలం పేరంటంచేసి వెళ్లుదుగాని' అని తల్లి దీనాలాపములుచేస్తున్నది. గాని ఏంలాభం? రాజేశ్వరి కంచంతెచ్చిపెట్టుకున్నది. 'అన్నంపెడితే నేను వెళ్లుతాను' అనిఅంటూ. భర్తఇచ్చినటైము అయిపోతున్నది. రాజేశ్వరి గుండె దడదడ కొట్టుకుంటున్నది. అమ్మమ్మ కంచంలో అన్నంపెట్టింది. పెట్టేదే తడవుగా కలుపుకుని తింటున్నది రాజేశ్వరి. 'నెయ్యి, నెయ్యనీయవే అమ్మా ఇదెక్కడ అత్తవారిల్లే తల్లీ' అని కండ్లుతుడుచుకుంటూ ఆవతలికి వెళ్లింది అమ్మమ్మ. ఇంతలో తండ్రి వస్తూ అంతదూరంనుంచే చూచి 'మాతల్లి వచ్చిందే మా రాజేశ్వరి; ఎప్పుడొచ్చావు తల్లీ! నేనుకూడా నీతో అన్నంతింటా. ఉండమ్మా ఎన్నాళ్లైంది మనం అందరం అన్నంతిని; లే సీతా! అన్నం తిందాం' అని చొక్కా వంకెకు తగిలించి పట్టుపంచ కట్టుకుంటున్నాడు రామారావు. సీత లేవలేదు, అక్కడే గోడకు చేరబడి కూర్చున్నది. 'ఎందుకల్లా కూర్చున్నావు? అమ్మాయికూడా వచ్చిందిగా' అన్నాడు సంతోషంగా రామారావు. 'వస్తేయేం? మళ్లీ వెళుతున్నది. అందుకే తొందరగా అన్నంతింటున్నది' అన్నది సీత దీనంగా. 'అదేమిటి? ఇప్పుడేవెళుతుందా? ఏం రాజేశ్వరి! ఇప్పుడే వెళుతావా?' 'వెళుతా నాన్నగారు ఇంట్లో పనిఉన్నది వెళ్లాలి,' అని అమ్మమ్మను మజ్జిగ పోయమన్నది. 'నిన్ను మరీ నోరులేందాన్నిచేసి వాళ్లు బాగా ఆడిస్తున్నారు. పంపారుగా సాయంకాలందాకా ఉండరాదు?' అని మజ్జిగపోసింది అమ్మమ్మ. 'మీరు ఇల్లా అంటారు వాళ్లు అల్లా అంటారు ఇద్దరిసందునా నలిగిపోతున్నాను' అని గద్గదకంఠంతో జవాబుచెప్పి అన్నంలోచేయి కడుక్కొనిలేచింది. ఇంతలో రాజేశ్వరిని పిలుచుకురమ్మన్నారు అని కబురు. వస్తున్నాను అని వెనక్కుతిరిగైన చూడకుండా కండ్లు తుడుచుగుంటూ వెళ్లింది రాజేశ్వరి. పట్టుపంచతో అల్లాగే కుర్చీలో కూలబడ్డాడు రామారావు. ఇల్లాగంటి సంబంధం నీవేచేశావని తన తల్లిమీద విసుక్కున్నది సీత ఏమితోచక.

♦ ♦ ♦ ♦

రామారావుగారి నాల్గవకొమార్తె వివాహం. బంధువులందరువచ్చారు. ఇళ్లూవాకళ్లు అన్నీ పచ్చతోరణములతో, ముత్యములతోరణములతో, రంగురంగుల విద్యుద్దీపముల తోరణములతో అలంకరింపబడి దేవేంద్రభవనంగా ఉన్నది ఇల్లు. పందిరిలో పంచవిధములైన మేళములు, ఎటుచూచినా ప్రతిబింబములు కనిపించు నిలువుటద్దములు, పండితులకు వకవైపునా, చూడవచ్చిన ప్రేక్షకులకు వకవైపునా, పెండ్లివారికి ఒకవైపునా, బంధువులకు వకవైపున వేరు ఏర్పాట్లుచేసి ఉన్నది పెండ్లిపందిరి. గాని సీతా, రామారావులకు ఏదో కొరత కనిపిస్తున్నది. అది రాజేశ్వరి రానికొరత వక్కటే. ఇక రాత్రికిపెండ్లి. అప్పుడువచ్చిన బంధువులలో ఒకపెద్దను పిలుచుగుని రామారావువెళ్లి బ్రతిమాలి రాజేశ్వరిని పసిబిడ్డను పిలుచుగుని అల్లుడిని వియ్యాలవారినికూడా వచ్చే ఏర్పాటుచేసుగుని వచ్చారు. ఆప్రొద్దున్న పలహారానికి మధ్యాహ్నము రాత్రి భోజనానికివచ్చాడు అల్లుడు. రాత్రి పదిగంటలైంది జయప్రదంగా కల్యాణం జరుగుతున్నది. ఆడవాళ్లలో

రాజేశ్వరి కూర్చున్నది. మగవాళ్లల్లో రాఘవరావు కూర్చున్నాడు. ఇక్కడ రాజేశ్వరి పూదలిపోతూనే ఉన్నది. తలంబ్రాలు అయినాయి. చివాల్న లేచి లోపలిహాల్లోకివెళ్లి వక్కపొడి ఏది అంటూ రాజేశ్వరి వంకచూచి తలవిసరాడు రాఘవరావు. ఎందుకు? అని లోపలికివెళ్లింది రాజేశ్వరి. నెమ్మదిగా ఏద్గో ఒక మాటచెప్పి 'నేను వెళ్లుతున్నాను; నీవు ప్రొద్దున్నే రా' అని దొడ్డిదార్నె వెళ్ళాడు రాఘవరావు.

తెల్లవారింది. అందరు ముఖార్చనలు చేస్తున్నారు. రాజేశ్వరి ఇంకా నిద్రలేవలేదు. అప్పుడే కబురు రాజేశ్వరిని పిలుచుకురమ్మన్నారు అని. సరే లేచివెళ్లింది పిల్లను మంచముమీదనే ఒదిలేసి. రాఘవరావు గదిలో కుర్చీలోకూర్చుని కాఫి త్రాగుతున్నాడు. అక్కడే గోడకు చేరబడి నుంచున్నది రాజేశ్వరి నిర్జీవంగా.

'ఇప్పుడు కొత్తఅల్లునితోపాటు ఐదువందలు నాకుఇస్తే నువ్వు అక్కడుండు నేనువస్తాను. లేకపోతే ఈరోజుతో నీకూనాకు తీరిపోయింది. పో మీవాళ్లింటికి ఫో; లేచిపో' అని రెండుతన్నులు తన్నాడు గాఢంగా. నుంచునిఉన్న రాజేశ్వరి కూలబడి వెక్కివెక్కి ఏడుస్తున్నది. ఇంతలో పిల్ల ఏడుస్తున్నదని అమ్మమ్మ కేకవేసింది. ఆకేకవిని కళ్లుతుడుచుకుని ముంగురులు సవరించుకొంటూ వచ్చింది రాజేశ్వరి. ఈ వైఖరి అంతా చూచి ఏదో జరిగిందనుకున్నారు అందరు. ఎవరో రహస్యముగా అడిగితే చెప్పింది ఉన్న యధార్థమంతా. ఆరోజు మొదలు రాజేశ్వరి లేవటంలేదు తల దువ్వుకొనుట అన్నము తినుటకూడా లేదు. కొంచము జ్వరముకూడా తగిలింది. అల్లాగె ఒక గదిలో పడుకుంటున్నది పిల్లను ఎవరో చూస్తూన్నారు.

♦ ♦ ♦ ♦

పెండ్లి నాల్గవనాటి రాత్రి తొమ్మిదిగంటలైంది గుమ్మమునకు ఎదురుగా ఆగింది పువ్వులపల్లకి ఊరేగింపుకు రానున్నవారందరు డ్రస్సు మార్చుకొనుట తాంబూలములు వేసుకొనుట ఇండ్లు సవరించుకొనుట ఎవరిపనిలోవారు నిమగ్నులైఉన్నారు ఇంట్లోవారు. ముందువైపు గదిలో మంచంవేసి పిల్లను నిద్రపుచ్చి తాను కూడా ఆమంచంమీదనే నిద్రపోయింది రాజేశ్వరి. ఈ సమయంలో రాజేశ్వరి మంచందగ్గిర రాఘవరావు ప్రత్యక్షమయ్యాడు. ఎవరోచూచి రామారావుకు చెప్పారు పెద్దల్లుడొచ్చాడని. ఇంతలో పసిపిల్లను భుజమున పడుకొపెట్టుకుని రాజేశ్వరిచేయిపట్టుకుని 'రాజేశ్వరీ! నేను కావాలంటే ఇప్పుడు ఇంటికిరా. లేకపోతే ఇక్కడే ఉండు' అంటున్నాడు. ఇంతలో రామారావు వెళ్లి అల్లుడిచేయి పట్టుకుని 'రాఘవరావు తొందరపడకు ఇంట్లో ఇంత వైభవంగా పెండ్లి జరుగుతూంటే ఆపిల్ల లేవకపోయె, నీవూ రాకపోతివి, సరే కదా. ఇప్పుడు ఈచీకట్లో తీసుకెళ్లటమేమిటి?' అన్నాడు దీనంగా. 'చాలుచాలు ఊరుకోండి. మీ మరియాద తెలిసిపోయింది. మీరూ ఒకపెద్ద మనిషి ననుకుంటున్నారు కాబోలు. నోరుమూసుకుని అవతలికి పదండి.' అని చేయి విదలించి పారేశాడు అల్లుడు. 'నీ మరియాద నాకు తెలియదనుకుంటున్నావు కాబోలు నీ దుండగములన్నీ వింటూ చూస్తూ ఊరుకోడం నాచేతగాక కాదు నీవు చిన్నవాడవని తెలియదని ఆలోచించి ఊరుకుంటున్నాను. నీవు కొట్టే దెబ్బలకి మీ అమ్మ తిట్టేతిట్లకి నోరులేనిపిల్ల గనుక పడి ఉంటున్నది. ఛీ దుర్మార్గుడా. ఇంక ఏం చేద్దామని వచ్చావు అర్ధరాత్రి' అని దగ్గిరికి వెళ్లాడు మామగారు. 'నోరుమూయి బుద్ధితక్కువ పెద్దమనిషి' అని చేయిఎత్తాడు అల్లుడు. చప్పున రాజేశ్వరిలేచి 'నాన్నగారు మీకు నమస్కారం చేస్తా ఊరుకోండి!' అని తండ్రి నోటికి చేయి అడ్డంపెట్టి భర్తకాళ్లు పట్టుకుని 'నేను వస్తా పదండి మనం వెళదాము' అని ఇద్దరిమధ్యా వొ౦గింది రాజేశ్వరి. ఆ కరుణామయదృశ్యం చూచేటప్పటికి ఆ ఊరేగింపు నిమిత్తం వచ్చియున్న స్త్రీ పురుషులెల్లరి మనస్సులు గభీర దుఃఖపూరితములైనాయి—

# భారతీయనారి



శ్రీ స్వామి వివేకానంద
అనువాదం : శ్రీ పూర్ణానంద

(గతసంచిక తరువాయి)

ఒకవృద్ధ లేఖకుని నీతిశిక్షను మేము పఠించెడువారము. దీనియందలి కొంత భావార్థము నా గుర్తుకు తగులుచున్నది—

గ్రామముయొక్క మంచి కొఱకు కుటుంబమును త్యజింపుము. దేశముయొక్క మంచి కొఱకొక గ్రామమును పరిత్యజింపుము. మనుష్యుని మంచికొఱకు దేశమును త్యజింపుము. విశ్వ కల్యాణార్థము సర్వ స్వము త్యజింపుము.

ఆ పుస్తకముల ఇట్టి శ్లోకము లుండును, వాటిని మేము పఠింపవలెను. గురుశిష్యులు ఇర్వురును వీటికి వ్యాఖ్య యొనర్తురు. బాలబాలికలు వీటిని ఒకేతడవ నేర్చుకొనెదరు; తరువాత విద్యావిధానము వేరు పడును. ప్రాచీన సంస్కృత విద్యాలయములు ముఖ్యముగ బాలకులతోడనే నిండియుండెడివి. బాలికలు కాదాచిత్కముగ ఆ విద్యాలయముల కఱిగెడువారు. అయితే, ఒకటి రెండు వ్యతిక్రమములుగూడ ఉండెడివి.

ప్రస్తుతము భారతదేశమున పాశ్చాత్యరీతిని విద్యనేర్వ ఉత్సాహమెక్కుడు; స్త్రీలకుగూడ ఈ ఉన్నతవిద్యను బడయ పట్టుదల ఎక్కువ. దీనిని గోఱనివారుగూడ కొందఱున్నారు. కాని, కోఱువారే జయించుచున్నారు. నేడుగూడ స్త్రీలు ఆక్స్‌ఫర్డ్, కేమ్‌బ్రిడ్జి విశ్వవిద్యాలయముల ప్రవేశింపజాలకుండుట ఆశ్చర్యకరము. హార్డ్‌వర్డ్, ఇయెల్ విశ్వవిద్యాలయములగూడ నింతే. కాని ఇరువది వత్సరముల క్రిందటనే కలకత్తా విశ్వవిద్యాలయద్వారము స్త్రీలకు తెరువబడినది. నేను బి. ఏ. పరీక్ష కృతార్థుడనైన వత్సరమున చాలమంది బాలికలుగూడ ఉత్తీర్ణలైన విషయము నాకు గుర్తుననున్నది. వారి పాఠ్యపుస్తకములు, తదితర విషయములు బాలురకున్నట్లే ఉండెను. ఒకేవిధమగు వ్యుత్పత్తిని వారుగూడ బడయవలసి యుండిరి. వారు మంచి కృతిత్వమును జూపిరి. మా ధర్మము స్త్రీవిద్య నాటంకపరచదు. 'కన్యాప్యేవం పాలనీయా శిక్షణీయాతియత్నతః' సరిగా ఈ విధముననే బాలికలుగూడ పాలింపబడి, శిక్షను బడయవలెను. ప్రాచీన శాస్త్రముల బాలబాలికలు పూర్వ మొకేవిధమగు విద్యనుబడయు ఏర్పాటు ఉండెను. కాని, తరువాత సమస్త జాతియొక్క విద్య ఉపేక్షింపబడెను. విదేశశాసనమున ఇంతకంటె ఎక్కుడేమి ఆశింపగలము? విదేశ శాసకులు కోఱునది డబ్బు. మా మంచికొఱకు వారు రాలేదు. పదిరెండేండ్లు నేను కఠోర పరిశ్రమనొనర్చి కలకత్తా—విశ్వవిద్యాలయపు గ్రాడ్యుయేటునైతిని. కాని, నేను మా దేశమున ఇరువది రూప్యములగూడ మాసమునకు సంపాదింపజాలను. ఈ విషయమును మీరు విశ్వసింపగలరా? కాని ఇయ్యది వాస్తవ విషయము. విదేశీయ ప్రతిష్ఠానములు అల్పధనమున అధికకార్యము నొనర్పగల బానిసల కొందఱిని సృష్టించుచున్నవి—గుమాస్తా, పోష్టుమాష్టర్, టెలిగ్రాఫ్ మాష్టర్ ఇత్యాదిగ—ఇది అచ్చటస్థితి.

ఫలితముగ బాలబాలికలవిద్య సంపూర్ణముగ నుపేక్షింపబడినది. ఆదేశమున చేయవలసినది చాలగ నున్నది. మీ సామెత ననుసరించియే మీకీ విషయమునుదెలుప గోరుచున్నందులకు నన్ను క్షమింతురుగాక—'హంసికి సుఖాద్యమైనది. హంసకుగూడ సుఖాద్యము.' విదేశమహిళలు భారతీయ స్త్రీల కష్టమునుగాంచి

చీత్కార మొనర్చుచున్నారు, కాని వారు పురుషులమాటను దలపెట్టనే దలపెట్టరు. వారు కేవలము బాలికల కొఱకు శోకాశ్రుపాత మొనర్తురు, కాని బాలికల వివాహ మొనర్చుకొనున దెవ్వరు? హిందూ బాలికల వివాహము వృద్ధులతోనగునని ఒకరికి చెప్పబడెను. అప్పుడాయన ప్రశ్నించినది. "అగుచో యువకులేమి యొనర్తురు? బాలికలు కేవలము వృద్ధులనే వివాహమాడుదురన్నమాట సరియా?" మేము ఆ జన్మవృద్ధలము—ఆ దేశమునందు అందఱును ముసలివారైపోయినారు!

భారతముయొక్క ఆదర్శము ఆత్మముక్తి. ఈ జగత్తు ఏమియునుకాదు—ఒక కల్పన, ఒక స్వప్నము. మన వర్తమాన జన్మ ఏతదనురూపమగు లక్షలక్ష జన్మలలో నొక్కటి. ఈ సమస్త ప్రకృతియు ఒకమాయ, ఒక ప్రహేళిక—ఒకానొక భ్రాంతి—వ్యాధియొక్క ఆకారము. ఇయ్యది మా దర్శనము. బాలకులే జీవితమునుగాంచి హసింతురు. ఇది ఎంత సుందరము? మంగళమయమని తలపోతురు. కాని, కొన్ని సంవత్సరములు గడచినపిమ్మట వారి సుఖస్వప్నము భంగమగును. వారు రోదించుచు అరుదెంచిరి, మరల రోదించుచునే అరుగుచున్నారు. ఒకజాతి తన యౌవనోచ్ఛ్వాసమున తాను దలపెట్టున దంతయు ఒనర్పగలనని భావించును. అది యనుకొనునుకదా, "మేము పృథివియందలి దేవతలము, మేము చిహ్నితులము. సర్వశక్తిమంతుడగు భగవంతుడు వారికి జగత్తునుశాసించు అధికారము నొసంగినాడు. ఈశ్వరుని అభిప్రాయమువారు పూరించుచున్నారు. వారెద్దానిని ఇచ్ఛించిన అద్దానిని ఒనర్పగలరు, జగత్తును తల్లక్రిందులు చేయగలమని వారు భావింతురు. లూట్, హత్య, ధ్వంసము ఒనర్చు అధికారము వారికున్నది. వారు భగవంతునికడ అధికారమును బడసిరి—వారు బాలకు లగుటవలననే ఇట్లు భావింతురు. ఎన్ని సామ్రాజ్యములు ఒకదాని తరువాత మరొకటిగ ఉత్థితమై ఉజ్వలములును, మహిమాన్వితములును అయినవి? తరువాత అవి ఎచ్చట కలసిపోయినవో ఎవరెరుంగుదురు? ఒక విశాలమగు ధ్వంసస్తూపము కేవలము మిగులుపడినది.

'నళినీ దళగత జలమతితరళమ్
తద్వజ్జీవన మతిశయ చపలమ్'

పద్మ పత్రమునందలి నీరు ఏ నిముషముననైన కుడిపోవునట్లు—ఈ మర్త్య జీవనముగూడ. ఏ వైపునజూచినను ధ్వంసస్తూపమే. నేడు అరణ్య మగుపించుచోట, కొంతకాలము క్రిందట నగర నగరీశోభిత మగు మహా సామ్రాజ్యముండెను. ఇయ్యది భారతీయ చింతయొక్క విశిష్టభావధార ప్రకృతి. నేడు పాశ్చాత్యునినాడుల యౌవన రక్త ప్రవాహము ప్రవహించుచున్నదని మే మెఱుంగుదుము. మనుష్యునికివలెనే జాతికిగూడ ఒక దినమున్నదని మే మెఱుంగుదుము. ఇప్పుడు గ్రీస్ ఎక్కడ? రోమ్ ఎక్కడ? శక్తిశాలి యగు స్పెయిన్ ఎక్కడ? ఈ స్థితినుండియే మరల భారతదేశ మేమగునది ఎవ రెరుంగుదురు? జాతి ఇట్లే జన్మించి, మరణించుచున్నది—ఇట్లే దాని ఉత్థానపతనములు. ఏ మొగల్ వాహినిని ప్రతిరోధించుశక్తి జగత్తున లేకుండెనో, ఎవరు మీ భాషయందు భయంకరమగు 'తార్తార్' శబ్దమును నుంచిపోయినారో, హిందువులు వారి ఆక్రమణమును శైశవకాలమునుండియే ఎఱుగును. హిందువునకు చాలినంత అభిజ్ఞత యున్నది. అతడు ఇప్పటి బాలకులవలె ఎగుడుదిగుడుపల్కుల పల్కజాలడు. పాశ్చాత్యులారా! మీ మనస్సు గోరునట్లు పల్కుడు. ఇవి మీ అదృష్టపుదినములు. మాకు చాలినంతగ అభిజ్ఞతయున్నది—అందువలన మేము మౌనముగనుంటిమి. నేడు మీకొకింత ఐశ్వర్యము వచ్చినదని మమ్ము ఏవగించుకొనుచున్నారు. ఇవి మీ రోజులు. 'నోటికి వచ్చినట్లు పలుకుడు'—ఇది హిందువుల మనోభావము.

నాయమాత్మా ప్రవచనేనలభ్యోనమేధయా న బహునా శ్రుతేన.

♦ ♦ ♦ ♦

**నావిరతో దుశ్చరితాత్ నాశాంతో నా సమాహితః నాశాంతమనసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్.**

వ్యర్థవాక్సమూహమువలన ప్రభువు దొఱకడు. ధీశక్తివలన నతనిని బొందజాలము. ఏ వ్యక్తి విశ్వముయొక్క మూలరహస్యము నెఱుగునో, తద్భిన్నము సకలము క్షణస్థాయియని గ్రహించునో, అతని కడకే ప్రభువరుదెంచును, అన్యత్ర కాదు. యుగయుగాంతరముల అభిజ్ఞతనుగడచి హిందువుడు తన శిక్షను సమాప్తమొనర్చి ప్రస్తుతము భగవంతునిమోమును వీక్షించుచున్నాడు. అవశ్యమాత డనేకముగ తప్పుల నొనర్చినాడు, బుంగలకొలది ఆవర్జన అతని నెత్తిపైననున్నది. అయిన నేమి? దుమ్ము. పట్టణముల శుభ్రముగ నుంచుట—వీట నేమియున్నది? అవి జీవితము నొసగగలవా? ఏజాతియందు సుందరములగు ప్రతిష్ఠానము లున్నవో, అయ్యదిగూడ మృత్యుకబళితమగుచున్నది. అగుచో, చంచలమును, క్షణభంగురమునునగు ఈ పాశ్చాత్య సభ్యతనుగుఱించి ఏమి చెప్పను? ఐదు రోజులలోతయారై, ఆరవరోజున సమయుచున్నది. ఈ జాతులలో నొక్కటియు ఒక్కపెట్టున రెండువందల ఏండ్లు బ్రతుకజాలవు. కాని, మా జాతీయరీతి నీతులు శతాబ్దములుగ పరీక్షకు నిలిచినవి. హిందువులనునది, మేము పృథివియందలి వృద్ధజాతుల నన్నిటిని సమాహిత మొనర్చితిమి. నూతనజాతుల సమాహితమొనర్ప ఇంకను నిలచియున్నారము. ఏలయన, మా ఆదర్శము ఈ జగత్తు కాదు, జగదతీతము. 'ఎవని ఆదర్శ మెట్లుండునో అతడట్లేయగును'—నీ ఆదర్శము మర్త్యమయిన, పార్థివమయిన నీవును అట్లేయగుదువు. నీ ఆదర్శము జడమైన, నీవును జడమేయగుదువు. మా ఆదర్శము ఆత్మయని గుర్తించుకొనుము. అతడొక్కడే అవినాశి—మరి దేనియొక్కయు అస్తిత్వము లేదు—అతనివలెనే మేము అమృతులము.

సంపూర్ణము

# మన దేశం

## (నాడు - నేడు)

తోటి సోదరులంత
తప్పుత్రోవల ద్రొక్క
అజ్ఞాన తిమిరాన్ని
అనలాన వేసింది!

మతము పేరట నెపుడు
హితవు బోధలజేసి
వేదాంత జ్యోతినీ
వెలిగించి చూపింది!

ధనికవాదలు హెచ్చ
హింసయే ప్రబలగా
శాంతి భద్రతలన్ని
బూదిలో గలిపింది!

సామ్యవాదము నేర్పి
హింసమార్గము మాన్పి
వేదగ్రంథాల్లన్ని
వేనోళ్ల పలికింది!

నాల్గుముక్కల తోడ
'నాయంత లేర'నీ
పాశ్చాత్య వ్యామోహ
పంకాన కూలింది!

మతపు దుస్తులతోడ
మచ్చుచల్లుచు నేడు
మనలోన మనలకే
మచ్చ రాల్పెంచింది!

—పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు.

# గొప్పింటి బిడ్డ



రచయిత :

**శ్రీ ప్రేమచందు**

●

'గొప్పింటి బిడ్డలంటే ఇల్లానే వుంటారు, చెడిపోతూన్న పనిని సంభాళించుకుంటారు.'

●

అనువాదం.

**శ్రీ నెల్లూరి కేశవస్వామి**



బీనీ మాధవసింగ్ గౌరీపురం జమీందారు. ఒకప్పుడు అతని పూర్వులు చాలా ధనవంతులు. చెరువూ మఠమూ వారి జ్ఞాపక చిహ్నాలే. అప్పుడు వారింటిముందు ఏనుగులు నిలిచివుండేవని వినికిడి. అయితే ప్రస్తుతం వాటన్నిటికీ బదులు ఒక ముసలిబఱ్ఱెమాత్రం కట్టి వుంటుంది. వంట్లో మాంసంముక్క లేకపోయినా పాలుమాత్రం చాలా ఇచ్చేట్టుంది. బీనీ మాధవసింగ్ తన ఆస్తిలో సగంవరకు వకీళ్లకు అర్పించుకున్నాడు. ఇక ఇప్పుడు అతని ఆదాయం ఏటా ఒకవేయి రూపాయలకి మించదు.

ఠాకూర్జీ సంతానమంతా ఇద్దరు కొడుకులు. పెద్దవాడిపేరు శ్రీకంఠ్ సింగ్ కష్టపడి కష్టపడి బి. యే. డిగ్రీ సంపాదించాడు. ప్రస్తుతం ఏదో ఆఫీసులో పనికూడా చేస్తున్నాడు. చిన్నకొడుకు లాల్ బెహారీసింగ్. ఉత్త పల్లెటూరిమనిషి. మంచి కండలు తేరిన దేహం. యౌవనం తొలకాడే నిండుమొగం. విశాల వక్షస్థలం. శ్రీకంఠుడు తమ్మునికి పూర్తిగాభిన్నం. దేహారోగ్యమంతా రెండక్షరాలు 'బి. యే.'కు బలిఇచ్చాడు. ఈ రెండక్షరాలే అతని ఛాతీ వైశాల్యమూ, ఎత్తుపొడుగూ, ముఖవర్చస్సూ అన్నీ సంగ్రహించాయి. ఇక ఇప్పుడీ మహాశయుడు తన తీరికవేళంతా వైద్యగ్రంథ పఠనలో గడుపుతూంటాడు. ఆయుర్వేదవైద్యంలో నమ్మకమెక్కువ. రాత్రింబవళ్ళు అతనిగదిలోంచి కల్వాపోట్ల మృదుమధురరావాలు వినిపిస్తూనే వుంటాయి.

శ్రీ కంఠుడు ఇంగ్లీషుపట్టం పొందినా ఇంగ్లీషు సాంప్రదాయాలంటే అతనికట్టే నచ్చేవికావు. పైగా ఒక్కొక్కప్పుడు వాటిని తీవ్రంగా ఖండించేవాడుకూడాను. వూళ్ళో అతనికెంతో గౌరవం. దసరారోజుల్లో అతనెంతో ఉత్సాహంతో 'రాంలీలా'లో పాల్గొనడం; రోజూ ఏదో వొకవేషంకూడా వేయడమూను. ఇతనివల్లనే గౌరీపురంలో 'రాంలీలా' జన్మ ఎత్తింది. పురాతనమత సాంప్రదాయాల్ని బలపర్చటంలో ఇతనితర్వాతే అని చెప్పాలి. ముఖ్యంగా సమిష్టి సంసారాలపద్ధతి (Joint Family System) అంటే ఇతనికి పంచప్రాణాలు. ఈనాటికోడళ్లు తమ కుటుంబాలతో కలసీ మెలసీ వుండటానికి మూతివిరచటం దేశ దౌర్భాగ్యానికొక చిహ్నంగా ఎంచేవాడు. ఇందువల్లే ఊళ్లోని కోడళ్లదృష్టిలో అతనికట్టే మంచి స్థానం చిక్కకపోయింది.

ఆనంది ఒక గొప్పింటిబిడ్డ. ఆమె తండ్రి ఒక చిన్న ఎస్టేటుకు తాలూకుదారు. ఒక గొప్పభవనం, ఏనుగులూ, గుఱ్ఱాలూ, సిపాయీలూ, గుఱ్ఱపు బగ్గీలూ, వేటకుక్కలూ, రకరకాల పక్షులూ, ఆనరరీ మేజిస్ట్రేటుపదవీ, పైగా అల్లాంటి గొప్పవారికి తగ్గ అప్పు—ఇవన్నీ అతనిహయాంలోవున్న సౌకర్యాలు. పేరు భూప్‌సింగ్. విశాలహృదయం మంచి స్వభావంకల మనిషి. కాని కర్మవశాత్తు అతని కొక్కకొడుకేనా లేడు. ఏడుగురూ కూతుళ్లే. పుట్టినవాళ్లు పుట్టినట్టుగా చల్లగా వుండిపోయారు. తమతో సమానమైనా లేక మించిన కుటుంబాలతో సంబంధాలుచేయటం ఎస్టేటునుమట్టిలో కలపటమన్నమాట. ముందుముందు ఉత్సాహం కొద్దీ ముగ్గురిపెళ్లిళ్లు మహావైభవంగాచేసివేసాడు. కాని పదిహేను ఇరవైవేల అప్పు అవగానే తనస్థితి తెలుసుకున్నాడు. ధర్మహస్తం ముడుచుకుపోయింది. ఆనంది నాలుగో అమ్మాయి. అప్పచెల్లెళ్లందరిలోనూ ఈమె ఎక్కువ అందకత్తె, గుణవంతురాలున్నూ. భూప్‌సింగ్‌కు ఆనందిపైన చాలా అపేక్ష. ఇక ఆనంది పెళ్లివిషయాల్లో ఏమీతోచక బాధపడ్తున్నాడు భూప్‌సింగ్. ఒకరోజు శ్రీకంఠుడు వాళ్ళింటికి ఏదో చందాకోసమని—వెళ్ళాడు. భూప్‌సింగ్ అతని బుద్ధికుశలతా, వినయవిధేయతా చూచి ముగ్ధుడైపోయాడు. వెంటనే జన్మపత్రాలూ, పంచాంగాలు తిరగేసారు. పెళ్ళికూడా హాయిగా జరిగిపోయింది.

ఆనందిదేవి తన నూతనగృహంలో అడుగుపెట్టగానే తెలుసుకుంది, ఇక్కడిరంగే వేరని. ఏ ఏ భోగభాగ్యాలు, ఏ ఏ సౌఖ్యాలు ఆమెకు పుట్టుకతోనే అలవడ్డాయో అవిక్కడ మచ్చుకైనాలేవు. ఏనుగులూ, గుఱ్ఱాల మాటల్లావుంచి, ఒక మంచి అందమైన గద్దైనా లేదు. కేవలం అదొక సాధారణ పల్లెటూరిగృహం మాత్రమే! కాని కొద్దిరోజుల్లోనే ఆనంది తానిదివరకెన్నడూ సౌఖ్యాలంటే ఏమిటో ఎరగనట్టుగా క్రొత్తమార్పుల్లో లీనమైపోయింది.

◆ ◆ ◆ ◆

ఒకరోజు పగలు రెండుఝాములవేళ, బెహారీ భోజనానికికూర్చుంటే పప్పులోకి నెయ్యిలేకపోయింది. అడిగాడు, "పప్పులోకి నేచ్చుక్కేదీ?"

"ఇవ్వాళే కొంచెంవుంటే అది కూరలో వేసేసాను."

వదినెమాటకు మాట అనటం లాల్‌బెహారీ సహించలేకపోయాడు. మొహం చిట్లించుకుంటూ అన్నాడు, "పుట్టింట్లో నేతికాలవలు పారుతాయిగాబోలు"అని.

స్త్రీ తిట్లు సహిస్తుంది. కొట్లు సహిస్తుంది, కాని పుట్టింటి నిందనుమాత్రం సహించలేదు. ఆనంది మొహం త్రిప్పుకుని అంది, "చింత చచ్చినా పులుపువిరగలేదు! అక్కడైతే ఇంతనెయ్యి పనివాళ్ళు తినిపోతారు."

ఇహ ఆమోటుమనిషికి వళ్లు తెలియనంతటికోపం వచ్చింది. ప్రక్కనున్న పాంకోడు అందుకుని ఆనందివేపు విసిరికొడ్తూ అన్నాడు, "నీ పొగరూ అణిచేస్తాను జాగ్రత్త"

ఆనంది పాంకోడ్ని తనచేత్తో ఆపింది. తలతప్పిపోయింది, కాని వేలుకుమాత్రం దెబ్బఘాటుగా తగిలింది. గాలిలో ఆకులా కోపంతో వణికిపోతూ తనగదిలోకొచ్చి నిలుచుంది. స్త్రీ ధైర్యసాహసాలూ, మానవగౌరవాలన్నీ ఆమె భర్తపైన ఆధారపడివుంటాయి. అతనిబలంపైనే, అతనిధైర్యంపైనే గర్విస్తుంది, పొంగిపోతుంది. ఆనంది కోపమంతా రెండు కన్నీటిబిందువుల్లో ఇమిడిపోయింది.

◆ ◆ ◆ ◆

శ్రీకంఠసింగ్ ప్రతిశనివారం ఇంటికొచ్చేవాడు. గురువారం ఈ సంగతి జరిగింది. ఈ రెండు రోజులూ ఆనంది అన్నం నీళ్లుమానేసి భర్తరాక కెదురుచూస్తూ కూర్చుంది. ఆఖరికి యథావిధంగా శనివారం

సాయంత్రం అతనొచ్చాడు. "అన్నయ్యా! కాస్త ఇంట్లో చెప్పేసేయి నాలుకపట్టివాడమని. లేకుంటే ఒకరోజు అనవసరంగా నెత్తురు కళ్ళజూడాలిసి వస్తుంది."

బీనీ మాధవసింగ్ కూడా సాక్ష్యమిచ్చాడు, "కోడలు పిల్లలకిల్లాంటి అలవాటు పనికిరాదు. మొగాళ్ళనోటికి తగులుక్కోటం బుద్ధిమంతుల్లలక్షణంకాదు."

లాల్ :—తానో గొప్పింటిబిడ్డతే అయింది, కాని మేమేమీ కూలికుంకలంకామే.

శ్రీ :—ఇంతకూ సంగతేవిఁటి?

లాల్ :— ఏమీలేదు. పూరికేనే ఎగిరిపడ్డది. పుట్టింటి ముందు మమ్మల్ని లెక్క చేయదు.

భోంచేసిం తర్వాత శ్రీకంఠుడు ఆనంది దగ్గిరకెళ్ళాడు. ఆమె మొహం పెంచుకున్నుర్చుంది. ఇతనుకూడా కాస్త కోపంతోనేవున్నాడు.

ఆనంది అడిగింది, "వళ్లు కులాసాగా వుందా?"

శ్రీ :—ఆఁ బాగానేవుంది... కాని ఇదేవిఁటి ఈరోజుల్లో ఇట్లా మొదలెట్టావు? ఇంట్లో ఈ గందరగోళమంతా ఏవిఁటి?

ఆనంది జరిగిన సంగతంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

శ్రీకంఠుని కళ్ళెఱ్ఱబడ్డాయి. ఇంతవరకొచ్చిందీ? ఈ కుంక వట్టి పోకిరీ అయిపోతున్నాడే! అని లేచి తండ్రి దగ్గిరకెళ్లి అన్నాడు, "నాన్నా నేనిక ఈ ఇంట్లోవుండడం సరిపడదు."

ఈ వాక్యాలే నాలుకపైకి తెచ్చినందుకు శ్రీకంఠుడు ఇదివరకెన్నోసార్లు తనతోటివాళ్ల నెందరినో చెడ చీవాట్లుపెట్టాడు. ఏ స్నేహితుడేనా తనతో ఈ మాటలంటే చాలు వాడిని గేలిపట్టించి వదిలిపెట్టేవాడు. 'మీరంతా వృత్తభార్యా విధేయులోయ్, వాళ్లను మీచెప్పు చేతుల్లోవుంచుకోటం తెలియక వాళ్లకు అడుగులకు మడుగులొత్తే వాజమ్మలు' అని హిందూసమ్మేళన కుటుంబవిధానాన్ని ఇంత తీవ్రంగా బలపరచే శ్రీకంఠుడే ఈరోజు తండ్రితో అంటున్నాడు, 'నాన్నా! నేనీ ఇంట్లో వుండటానికి వీల్లేదు.' అని శ్రీవాళ్ల శ్రీరంగనీతులన్ని దూరమున్నంతమట్టుకే, పరీక్షసమయమొస్తే ఓపికా, ఓర్పూ అన్నీ శలవు తీసుకుంటాయి.

బీనీ మాధవసింగ్ ఆదుర్దాతో లేచి కూర్చున్నాడు. "ఎందుకూ?"

శ్రీ :—నాకూ కాస్తోకూస్తో గౌరవమనేదివుంటుంద్దా? ఇప్పు ఈ ఇంట్లో పెంకితనం ఎక్కువై పోతోంది. ఎవరికైతే పెద్దాచిన్నా అనే తారతమ్యముండాలో వారే నెత్తినెక్కి కూర్చుంటున్నారు. ఎంతైనా నేనొకరి నౌఖరునేకదా, ఎప్పుడూ ఇంట్లోనే వుండటానికి వీల్లేదాయను. ఇక నావీపు వెనకాలనా స్త్రీపైన చెప్పులవర్షం కురుస్తుంటూంది. ఏదో ఒకటి రెండుమాట లనుకున్నారంటే ఫరవాలేదు. అంత మట్టుకు వోర్చుకోగలను. కాని ఆపైని తన్నులూ గుద్దులూకూడా పడ్తాయంటే నోరు మెదల్చకుండా ఎట్లా పూరుకోను?

బీనీ మాధవసింగ్ ఈరోజు అతని ముఖలక్షణాలు ఇట్లా మారిపోవటం చూచి ఇంతమాత్రం అనగలిగాడు, 'నాయనా! నువ్వు బుద్ధిమంతుడివైకూడా ఇల్లా మాట్లాడొచ్చా? స్త్రీలు కుటుంబనాశనం

చేసేదిల్లాగే. వాళ్ళను అట్టే ప్రోత్సాహించటం మంచిదికాదు. లాల్ బెహారీ నీ తమ్ముడు. వాడిచేతఏదైనా తప్పిదమైతే వాడి చెవిపట్టుకో, కాని...'

శ్రీ:-లాల్ బెహారీని ఇక నా తమ్ముడిలా తలచను.

మాధవ:-స్త్రీ కొరకా?

శ్రీ:-కాదు, వాడి పొగరుమోత్తనం, కఠినత్వం కొరకు. వాడి ఈ చర్యను నేనెప్పటికీ క్షమించలేను. వాడేనా ఈ ఇంట్లో వుండాలి, లేదా నేనేనా వుండాలి. మీకు వాడిపైన ఎక్కువ ప్రేమ వుంటే నాకు శెలవిప్పించండి; నా భారమేమిటో నా తలపైనే పెట్టుకుంటాను. లేదా నేనే వుండాలని వుంటే వాడిని తక్షణమే ఎక్కడికేనా వెళ్లిపొమ్మని చెప్పండి. ఇది నా ఆఖరి తీర్పు.

ఇంతసేపూ లాల్ బెహారీ తలుపుచాటున మౌనంగా నిలుచుని అన్నమాటలు వింటున్నాడు. అన్నంటే ఎంతో భయం, భక్తి. ఎన్నడుకూడా శ్రీకంఠుని యెదుట మంచంపైన కూర్చోటానికిగానీ, బీడా వేసుకోటానికిగానీ సాహసించలేదు. తండ్రియెడలకూడా ఇంత భక్తిశ్రద్ధలు చూపకపోయేవాడు. శ్రీకంఠునికూడా తమ్మునిపైన చాలా ప్రేమ. అతనికి జ్ఞాపకమున్నంతమట్టుకు ఎన్నడూ తమ్మునిపైకి గుడ్లెఱ్ఱజేసైనా ఎరగడు.

అన్ననోటినుంచే ఈరోజు శూలపోట్లలాంటి మాటలు రావటం విని లాల్ బెహారీ మనసు చివుక్కుమంది. అతనికోపంరాలేదు. వెక్కి వెక్కి ఏడవట మారంభించాడు. తాను చేసిన పనికి విచారిస్తున్నాడనటంలో సందేహమేమీ లేదు.

ఏడుస్తూ ఇంట్లోకెళ్లి తనగదిలో బట్టలేసుకున్నాడు. ఏడుస్తున్నాడని ఎవరేనా అనుమానించకుండా కళ్లు తుడుచుకున్నాడు. ఆనందిదేవి గదిదగ్గిరకెళ్లి అన్నాడు, 'వదినా! నాతో ఇంట్లో వుండకూడదని అన్నయ్య నిశ్చయంచేసుకున్నాడు. ఇక నా మొహమే చూడదలచుకోలేదు. అంచేత నేనే వెళ్లిపోతున్నాను. నా మొహం ఇక చూపించను. నాలో ఏదేనా దోషముంటే క్షమించాలి.' లాల్ బెహారీ కంఠం రుద్ధపడిపోయింది.

♦ ♦ ♦ ♦

లాల్ బెహారీ తలవంచుకుని ఆనందీ గదిముందు నిలుచునివున్న సమయానికి శ్రీకంఠుడు కోపంతో ఆవలినుంచి వచ్చాడు. తమ్ముణ్ణి చూచి అసహ్యాభావంతో మొహం త్రిప్పేసుకున్నాడు. అతని నీడ సోకటం కూడా ఇష్టంలేనట్టుగా ప్రక్కనుండి తప్పుకుని వెళ్లాడు.

ఆనంది లాల్ బెహారీ గురించి భర్తతో ఫిర్యాదయితే చేసింది, కాని ఇప్పుడు మనసులో విచారిస్తోంది. ఆమె వస్తుతః చాలా ఉత్తమస్వభావంకల మనిషి. ఈ విషయం ఇంత పెరిగిపోతుందన్న సంగతి ఆమె వూహలోకికూడా రాలేదు. వున్నకోపం కాస్తా కరిగి నీరైపోయింది. తానూ ఏడవట మారంభించింది. హృదయమాలిన్యాన్ని కడిగివేయటానికి కన్నీటికంటె ఉపయుక్తమైన వస్తువు మరొకటి లేదు.

శ్రీకంఠుణ్ణి చూసి ఆనంది అన్నది, 'లాలా ఆవల నిలుచుని ఏడుస్తూన్నాడు.'

శ్రీ :-అయితే నేనేంచేయనూ ?

ఆనంది :-లోపలికి పిలవండి......నా నాలుక్కాలిపోను, నేనెక్కడినుంచి తెచ్చిపెట్టానమ్మా ఈ పాడు గోల !

శ్రీ :-నేను పిలవను.

ఆనంది :-పిలవండి. తర్వాత మీరే విచారిస్తారు...పాపం ! చాలా చింతిస్తున్నాడు. ఎక్కడికేనా లేచిపోతాడేమో...

శ్రీకంఠుడు లేవలేదు. ఇంతలో లాల్ బెహారీ మళ్లీ అన్నాడు, ' వదినా ! అన్నయ్యకు నా నమస్కారమని చెప్పు. నా మొహం చూడదలచలేదు గనక వెళ్లిపోతున్నాను. ' లాల్ బెహారీ ఇంతమాత్రం అని గిరుక్కున తిరిగి ద్వారంవైపుకు తొందరగా పోసాగాడు. ఎకాయకిని ఆనంది తన గదిలోంచి ఈవలికొచ్చి అతనిచేయి పట్టుకుంది. లాల్ బెహారీ వెనక్కుతిరిగి చూశాడు. గుడ్లల్లో నీళ్లు గుక్కుకుంటూ అన్నాడు, ' నన్ను వెళ్లనీయి. '

ఆనంది :-ఎక్కడికి ?

లాల్ :-నా మొహమెవరూ చూడని చోటికి.

ఆనంది :-ఊహుఁ నేను వెళ్లనివ్వను.

లాల్ :-నేను మీతో వుండటానికి అర్హుణ్ణి కాను.

ఆనంది :-ఒక్కడుగు ముందుకు వేశావంటె నామీద వొట్టు.

లాల్ :-నా విషయమై అన్నయ్య మనసులో ఏమీలేదని తెలిసేదాకా నేనింట్లో వుండను.

ఆనంది :-దైవసాక్షిగా చెబుతున్నాను, లాలా, నీగురించి నామనసులో ఏమీలేదు.

ఇక శ్రీకంఠుని హృదయంకూడా కరిగింది. గదీవలికొచ్చి తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు. అన్నదమ్ములిద్దరూ హృదయభారం తగ్గేట్టు ఏడ్చారు. లాల్ బెహారీ వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నాడు, ' అన్నయ్యా ! ఇక మరెప్పుడూ నా మొహం చూడనని అనకు. దీనికి మినహా నువ్వే శిక్ష విధించినా సంతోషంతో స్వీకరిస్తాను. '

శ్రీకంఠుడు వణికే కంఠంతో అన్నాడు, ' లల్లూ ! ఆ మాటలన్నీ మరిచిపో. దేవుని చూపు చల్లగా వుంటే మరెప్పుడూ అల్లాంటి సమయం రాదు. '

బేనీ మాధవసింగ్ ఆవలనుంచి వస్తూ అన్నదమ్ములు కౌగలించుకోవటం చూసి సంతోషంతో వుప్పొంగిపోతూ అన్నాడు, ' గొప్పింటి బిడ్డలంటే ఇల్లానే వుంటారు, చెడిపోతూన్న పనిని సంభాళించుకుంటారు. '

వూళ్లో ఈ సంగతి విన్నవాళ్లంతా ఆనందిదేవి ఉదారస్వభావాన్ని ఈలా పొగిడారు, ' గొప్పింటి బిడ్డలు ఈలా వుంటారు. '

# పల్లెటూళ్లు - వాటి ప్రస్తుత దౌర్భాగ్యస్థితి

★ శ్రీమతి గోపరాజు సీతాదేవి ★

గ్రామములని చెప్పబడు పల్లెటూళ్ల దీన స్థితినివర్ణించలేము. 'పునరుద్ధరింపబడాలి' అని ప్రబోధము చేయు 'మహాత్మాగాంధి' యుగములోనే కొండాడ సీమనూతుల్లో నీళ్లులాగ చాలా అడుగున వున్నాయి.

**విద్య**

పల్లెలలో పెద్దవారికి చాకలి పద్దువ్రాయనేర్చిన చదువు వచ్చునోరాదో, కాని వచ్చునని మాత్రము ధీమాగా చెప్పలేము. వచ్చినా ఏపేపరైనా, ఏపుస్తకమైనా, చదివినా అందలి సంగతులు అర్థం కావు. నూటికి ఏ ఇద్దరో ముగ్గురో తప్ప, అక్షరజ్ఞానముకూడా తెలియనివారు గలరంటే అందులోని నిజము తెలుస్తుంది. ఇపుడు చదువుతూవున్న పిల్లల భావిస్థితి అగమ్యగోచరంగా వుంటుంది. విద్యావిధానం సరిలేదు. దానికి తగ్గట్టుగా ఉపాధ్యాయుల అశ్రద్ధ. వారు విధి తీర్చుకోవడమే కాని, క్రొత్తపద్ధతులు నేర్పుటకాని, వారిని అభివృద్ధిలోనికి తీసుకురావడము కాని, వారికి తెలియదు. పల్లెటూళ్లు అభివృద్ధి పొందాలంటే ప్రయోజనవిద్య కావాలి. ప్రాథమిక విద్యావిధానం సంస్కరింపబడాలి.

**మహిళా సంఘములు**

ప్రతి పల్లెలోనూ ఒక మహిళాసంఘము స్థాపింపబడాలి. ఇందుకు పట్టణములోని మహిళా సంఘము, సోదరీ ప్రతినిధుల సహాయము, ప్రచారము ముఖ్యావసరం. దేశహితార్థము పాటుబడు సోదరీమణులు పల్లెటూళ్ళలోకూడా ప్రచారము సాగించి, అక్కడవుండే స్త్రీలనుకూడా విజ్ఞానవంతులనుచేయు భారమువహించాలి. ముఖ్యముగా దేశము వృద్ధిలోకి రావాలంటే పల్లెలను మేలు కొలపాలి. పట్టుదల, ధైర్యము, వుత్సాహము, కార్యదీక్ష, ఆరోగ్యము వీరికి పెట్టని భూషణములు. కాని వీరి సుగుణములు మంచిలో వుపయోగించని కారణమున ప్రయోజనం లేకపోవుచున్నవి.

**ఆర్థికదుస్థితి**

పల్లె సోదరీమణులు ఆర్థికంగా చాలా ఇబ్బంది పడతారు. అందరూ వ్యవసాయ పరిశ్రమ మూలమున ఒక సంవత్సరము పండి, ఒక సంవత్సరము పండక, పన్నులు చెల్లింప తప్పక పురుషులే ఇబ్బందికి లోనవుతారు. ఇంక స్త్రీల సంగతి చెప్పనే అవసరములేదు. ఆర్థిక యిబ్బంది మూలమునను, అజ్ఞానమువల్లను తమ భర్తలు తెచ్చిన సరకులను యితరులకు స్వల్పధరలకు చాటుగ ఒకరికి తెలియకుండా ఒకరు విక్రయిస్తూవుంటారు. దీని మూలమున గృహకలహములే కాక సంసారములు హీనస్థితికివచ్చి అనేక కుటుంబములు చెడిపోవుచున్నవి.

**పఠన మందిరములు**

వీరికిగల అజ్ఞానము, సోమరితనము, అవిద్య, అసత్యము, మూఢ నమ్మకములు, తగవులాటలు, ఒకరిని చూచి పరిహసించడము, వృథాకాలక్షేపము పోవలెనంటే ప్రతి పల్లెటూరులోనూ స్త్రీలకు చెందిన పఠనమందిరములు వుండవలెను. ఆయా గ్రామములకు చెందిన తాలూకాలనుంచి సంఘ ప్రతినిధులువచ్చి నెలకొకసారి ఐననూ ఉపన్యాసములు ఇస్తూ వుండిన అచిరకాలములోనే ఉన్నతస్థితి పొందగలవు.

# — సీత మహాసాధ్వి —

**'గృహలక్ష్మి' 1940 నవంబరు, డిశంబరు సంచికలలో శ్రీయుత ఆచంట సూర్యనారాయణమూర్తి, బి. ఎ. బి. యల్. గారి "సీత శాపము", "దమయంతికాలంలో విడాకులు వుండివుండాలి" అనే వ్యాసములపై విమర్శనలు.**

"...సీతయొక్క సతీత్వము, పవిత్రత నిరూపించుటకయే అన్ని వేల శ్లోకములుగల రామాయణ మహా గ్రంధము వ్రాయబడినది. కాని, పదునాల్గు సంవత్సరాలు మగనితో అరణ్యవాస మొనరించి, అష్ట కష్టముల కోర్చికొని, సహధర్మచారిణిగా మగనిని అనుసరించి మెలగిన సీతా మహాసాధ్వి, రావణుని తన శాపానలంబున శలభము మాడ్కి తలచుకొనినచో నశింపజేయగల వాక్సుద్ధిగల సతీలలామ, పతిబల వీర్యత్వములకే ప్రాముఖ్య మివ్వదలచి, హనుమంతునంతటి భక్తుడు కోరినను రానని, వీరావతంసుడగు శ్రీరాముడు రావణ సంహారణార్థమెపుట్టెనని నాతని కార్యనిర్వహణమునకు విఘ్న మాపాదింపని సీతామతల్లి, పతివ్రతలలో మొదటి మణి, కొలికపూస అనతగ్గ జానకి, శాంతమున, ఓర్పున భూమికెనవచ్చు భూమిజ, తనశీలాన్ని అగ్నిపరీక్షలో గెల్చి, ముల్లోకముల భళీ భళీ యనిపించిన పరమ పవిత్ర, లోకమాత, శాంతమతి, దాంతమతి, తన్ను భర్త తిరిగి శీలపరీక్ష కోరగా, "ఆత్మ విశ్వాసంలేని రాజని" పతినింద జేయునట్టి, అవివేకిని క్రిందను, అహంకార తామసి క్రిందనుకట్టి వ్రాయుట, వ్రాయువారి అపచారములు కావా! అంత తామసాహంకారిణియే యైతే తన్నాలంకకు తీసుకువెళ్లకుండగా, రావణునినే శపించియుండలేదా? పోనీ, మొదటిలోనే తొందరెందుకని, మగడుబెట్టే బాధలుపడి పడి, విసుగెత్తి పెట్టిందనుకుంటే విసుగు కోపముగల నారి, లోకాదర్శ రమణి కానేరదు. కష్టపరం పరలలోనే మనుజుల మహత్యములు నిలబడి లోకాదర్శములగును కాని, శాపకారులు ఎన్నికలోనికి రారు. విజ్ఞానిక కవిత్వంలో దోషారోపణకు, ఎరగనివాళ్ల కేరువులు పెట్టుటకు తావుండకూడదు.

శ్రీరామచంద్రుని సుగుణములకు, పితృవిధేయతకు ముల్లోకములు తలలాడించినవి. లోకమంతా మొగ్గినది. కొడుకు విధేయతకు, పితృభక్తికి సంతసించి దశరధుడు ఏమని దీవించాడు.—

"పది కొంపలును లేని పల్లెయైనను, రామభజన మందిర మొండు వరలుగాత.
ఎట్టి వ్రాతయు శ్రీరామచుట్టబడక, వ్రాయబడకుండు గావుత
రామవాక్యమనిన; దిరుగనిదని యర్థమగును గాత!" (పానుగంటివారి పాదుకలోనిది)

అట్టి శ్రీరాముణ్ణి, తన్నేగాని కలనైన పరభామనుతలంచి యెరుగని మహానుభావుణ్ణి, పతియే దైవమని నిరూపించి చూపించిన సీత విసుగెత్తి 'ఆత్మవిశ్వాసంలేని రాజని, అతన్ని నమ్మికొలిచే మూఢప్రజలు స్వాతంత్ర్యంలేక నశించిపోతారు' అని శపించిందని క్రొత్తపూతలు. ఆహా! అందుకే మనకి స్వతంత్రత నశించిందికాబోలు. ఇట్టి వార్తలు విని నమ్మినవాళ్లకు మాత్రం, నిజంగా, సీతాశాపం తగులుతుంది. రామపతాలు, రామభజనలు, రామకీర్తనలు, నశించిపోయి, అపహాస్యమగుటకే యిట్టి నవయువక కవిత్వా లుద్భవిల్లాయి. శ్రీరాముడే పరమాత్మని హనుమంతునికి నచ్చచెప్పిన, సీతా అధ్యాత్మ రామాయణ ఘట్టము, శివుడు మనకుచెప్పిన పరమకీలకం రామమంత్ర మహిమ. రామనామాక్షరద్వయ మహిమాతిశయమెరిగిన పరమ శివుడు రామాయణ గ్రంధమంతయు మహాఋషులకు పంచియిచ్చి, రామ అన్న రెండక్షరముల కీలకమే తను గ్రహించినట్లు పెద్దలుచెప్పిరి. అట్టి శ్రీరామచంద్రుడు, సాక్షాత్తు ఆదివిష్ణువు రామునిగాను, శ్రీలక్ష్మి సీతగాను యుద్భవించిన వారికా, పామరనరులము, పతితులమగు మనము మెరుగుపూతలు పూయుట!

దమయంతీ విడాకులు కూడా పై వ్రాతల్లాంటివే. విసిగిన దమయంతియైతే, తిన్నగా పుట్టింటికే పోవును. ఒప్పుకున్నట్లే చరిత్రలో వుందిగా నలోపాఖ్యానంలోనా? చిత్రనళీయ నాటకంలోనా? దేనిలోను లేదు.

నలునిరూపముమారి, బాహుకనామంతో ఋతుపర్ణ మహారాజువద్ద యున్నట్లెరిగిన సుదేవుడెంతరెూ నలుని విదర్భకు రప్పింప పన్నిన మాయాస్వయంవర మని గ్రంథమే చెప్పుచున్నది. పరాశరస్మృతిలోని, శ్లోక మెత్తి ద్వితీయ వివాహానికి హక్కుందని చూపించాడు.

“నష్టే, మృతే, ప్రవజితే, క్లీబే చ పతితేపతౌ। పంచస్వాపత్సునారీణాం, పతిరన్యోవిధీయతే” అని ప్రస్తుతము డైవోర్సుచట్టం కోరేవారుకూడా సూత్రాలు చూపిస్తున్నారు. అదిసాకుగా, మహా పతివ్రతయైన దమయంతియే ఒప్పుకుందని నిర్ధారణయా! మారుమనువుండి, చేసుకున్న హిందువులలో హీనజాతులవారు. పాశ్చాత్యులుకూడా, భారతీయ పతివ్రతాధర్మమే మంచిదని, తమదారికి దరిగానకవిచారించి, మన మహిళా మణులుకోరి సభలుచేయునప్పుడే బోధించుచుండగా, అట్టి ద్వితీయ స్వయంవరము (భర్తగలదానికి) చేసి కొనుటకెట్టి ఆక్షేపణలేదని, నిదర్శనపూర్వకంగా నిర్ధారణచేసి, ప్రేరేపించుటకిట్టి వ్రాతలువ్రాయు పిచ్చి తలంపు లికనైన మానుటుత్తమము.

రారాజులందరు ఎందుకొచ్చారన్నారీ సూర్యనారాయణమూర్తిగారు. ఏ రాజులొచ్చారు? ఏం చేశారు. ఒక్క ఋతుపర్ణుడేవచ్చి, ఎవరూలేరని, అలంకారాలులేవని, తన్నవమానించుటకీ పన్నాగమని విచారించాడే! అసలు మొదటనే దమయంతి సుదేవునితో :

“దైవంబుగానెంచు ధవునెడ మరిమది
చేడియకీ ద్రోహచింతదగునె
ధర్మంబు నశియించు దలగు పుణ్యము
పరి తాపముద్భవమొందు బాపమడరు,
నగుబాటు వొడము మానకయుండు నపకీర్తి
మరిమరి జనియించు మానహాని
......ఉండెలేకుండె నానాథు నొనరజూచు
భాగ్యము సుదేవ యీభంగి వలదునాకు॥

అన్నట్లు, చిత్రనళీయ నాటకంలో (ధర్మవరం కృష్ణమాచార్యులుగారు) వ్రాసియున్నారు.

“అనఘుడింద్రుడెవచ్చి, తనపాణివేడిన। కనకాంగి వినదయ్యె ననుచువింటి”అని శ్రీ అయోధ్యా పురాధీశ్వర మహారాజు ఋతుపర్ణుడుకూడా, తన్నాహ్వానించిన సమయంలో, దమయంతీ పాణిగ్రహణోత్స వానికి బదులు విచారించాడు.

అట్టి మహాపతివ్రత, దేవేంద్రాదుల ధిక్కరించి, నలునేకోరి, ఏకాకారులై భంగపరచవచ్చిన, అష్ట దిక్పాలుల తన సతీత్వముచేమెప్పించి, భారతదేవిచే ఎలుకచేయబడి వివాహమాడి సకలకష్టముల నతిసహన ముతోభరించి కిరాతుని తన శాపానలమున దగ్ధమొనరించిన పవిత్ర భారతసతికా యిట్టి తలవంపుపూతలు...”

—ఆచంట సత్యవతమ్మ.

*   *   *   *

“...నిషధాధిపతియైన నలుడు జూదములో రాజ్యమును కోల్పోవటము-విపినముల పాలుగావటము-నిద్రావస్థలో నున్నపుడు భార్య తనతోగూడ అవస్థలపాలు సేయుట కిష్టములేక వదలివేయటము - కర్కోటకునిచే వికృతరూపమునుబొంది, ఋతుపర్ణునివద్ద నుండటము - దమయంతి అవస్థలుపడుతూ విదర్భకు చేరటము. అందరు ఎరిగినసంగతే. విదర్భకేగిన తరువాత దమయంతి అవస్థ నెట్లున్నదో చూడుడు.



వార్షికోత్సవ సందర్భమున జరిగిన నికేతన బాలికల
నూలు వడుకు పోటీ.

## సీత మహాసాధ్వి

ఉ. "భామ విదర్భకేగి తనబంధుజనంబులయొద్ద నుండియుం
క్షామలి దేహసౌఖ్యములకున్ వెలియై మలినార్ధవస్త్రమున్
భూమిరజంబునంగమున బొల్పగుచుండగ నుండెజీవిత
స్వామినిజేశు జూచుదివసంబులు గోరుచు సువ్రతంబుతోన్"

ఈ విధంబుగా కాలము గడుపుచుండగా తన భర్త నన్వేషించుటకై, ప్రతిదేశమును గూఢచారులను పంపుచు వారలతో ఈ విధంగా జెప్పినది. 'సత్యనిరతుడవు సతినింతి వర్జించి దాని వస్త్రార్ధంబుదరిగి నీవు..............................రాని నాడు రండెరింగి" (భారతము, అరణ్య 2 ఆ. 157) వారు దేశములు తిరిగి, తిరిగి తుదకు ఋతుపర్ణునా స్థానములో దమయంతి యను మన్నమాటల నుచ్చరింపగా వానికి సమాధానము వచ్చెను. అపుడా గూఢచారు లతనే నలుడైయుండ నోపని ఎరిఁగి, ఆ సంగతి దమయంతితో వచ్చి చ్చెపిరి. దమయంతి సంతసించి సుదేవుడను బ్రాహ్మణుని ఋతుపర్ణునివద్ద కంపి "రేపు దమయంతీ స్వయంవరము-మీరు రావలె"నని కబురంపెను. ప్రథమ స్వయంవరము చాటింపు వేసినట్లు చాటింపు వేయలేదు. ఋతుపర్ణునివద్ద నలుడున్నాడని గ్రహించి అతని విదర్భకు రావించుటకై ఋతుపర్ణునకు స్వయంవరమని కబురంపినఎడల ఋతుపర్ణుడు నలునిరథచోదకునిగా నుంచుకొని ఒక్కరోజులోనే రాగలడు గనుకను, నలుడే రథచోదకుడుగానుండిన ఎడలనే ఒకరోజులో రాగలరు గనుకను, మరొకరు రథచోదకులుగా నున్న ఎడల ఒక్కరోజులో రాలేరు గనుకను ఒకరోజు గడువువుండగా కబురంపింది. తండ్రికీ సంగతెంతమాత్రము తెలియదు. తెలియదనటానికి నిదర్శనము భారతము కాస్తచూస్తే తెలుస్తుంది (అరణ్య ఏకోనసప్తతిత మోధ్యము 14-వ శ్లోకం "అయమర్ధోన సంవేద్యోభీమేమాత: కదాచన త్వత్సన్నిధేనియోక్ష్యాహం సుదేవం ద్విజసత్తమమ్") స్వలాభంచేత తండ్రి, కూతురు స్వలాభంచేత అబద్ధంసాటింపు వేయలేదు. సాటింపు సంగతే (కబురంపటమే) తండ్రికి తెలియనపుడు ఇతర రాజులకేం తెలుస్తుంది. దమయంతిని పెళ్లాట్టానికి మేమమ్మాతగుదుమంటూ పెళ్లికొడుకులు తయారవనేలేదు. ఇదంతా వట్టి భ్రమ. శ్రీ సూర్యనారాయణమూర్తిగారి స్వకపోల కల్పన. స్వయంవరానికి ఋతుపర్ణునితోసహా నలుడొస్తాడు. అపుడు దమయంతి కొడుకును, కూతుని నలునివద్దకు పంపుతుంది. వారలనుచూచి దుఃఖించి ముద్దిడుకుంటాడు. ఈ సంగతంతా కేశినిద్వారా దమయంతి తెలిసికుంటుంది. ఆతడే తన భర్తయైయుంటాడని కృతనిశ్చయురాలై నలునివద్దకేతెంచి కన్నీరుమున్నీరుగా దుఃఖిస్తుంది. అపుడు నలుడు దమయంతితో నేనే నలుడని తెల్పుతూ అన్నమాటను చూడండి "స్వైరవృత్తా యథాకామమను రూపమి వాత్మనః శ్రుత్వైవచైనం త్వరితో భాంగాసురిరుపస్థితః" దీన్నిబట్టి కులస్త్రీలలో పునర్వివాహమనేది లేదనీ, స్వైరిణీజాతి స్త్రీలలో గలదనీ స్పష్టముగుచుండగా శ్రీ సూర్యనారాయణమూర్తిగారిట్టి వ్రాతకు గడంగుట మిక్కిలి శోచనీయము..."

—నాదెళ్ళ రామకృష్ణశాస్త్రి.

శ్రద్దధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి.

శ్రద్ధగలవాడు తనకంటెఁ దక్కువవాడైనవానికడనుండియైనను నుత్తమవిద్యను గ్రహింపవలయును. అంత్యజునియొద్దనుండియైనను నుత్తమధర్మమును నేర్వవలయును. తక్కువకొలమువాని కడనుండియైనను స్త్రీరత్నమును గ్రహింపవలయును.

—మనుధర్మశాస్త్రము.

# చలనచిత్రాలు

## ఫేమస్ ఫిలిమ్సువారి "ధర్మపత్ని"

విడుదలయై ఆంధ్రదేశపు ముఖ్య కేంద్రాల్లో అఖండమైన విజయయాత్రలు చేస్తూవుంది.

సుప్రసిద్ధ దర్శకులు శ్రీ పి. పుల్లయ్యగారి దర్శకత్వంలో రాణకెందిన యీ చిత్రం కళావైదగ్ధ్యాన్ని వేనోళ్ల చాటుతోంది—చక్కని కథ, కథకు పుష్టినిచ్చే సన్నివేశాలు, తగుమైన సంగీతం చిత్రానికి ప్రత్యేకతని సమకూర్చాయి.

శోభనపుగదిలో కథానాయకుడు తనకివ్వబడిన పాలగ్లాసులోనిపాలను పూర్తిగా త్రాగి కాళీగ్లాసును భార్యకు యీవడంలో, కథానాయిక చెరువునుంచి వస్తూవుంటే, దారిలో క్రూరుడు ఆనందరావు రాకకుపూర్వం, త్రాచుపామును చూపించడం—మొదలైన సన్నివేశాలో దర్శకులయొక్క చాతుర్యం ఉట్టిపడుతోంది—

శ్రీమతి శాంతకుమారి, భానుమతి, పెద్దాపురం రాజాగార్లు చాలా చక్కగా నటించారు. శ్రీ కుటుంబరావుగారు సాంఘిక చిత్రాల్లో "విలన్" భూమికను నిర్వహించడానికి క్రొత్తదారులు చూపించారు.

మొత్తంమీద చిత్రం ఉత్తమశ్రేణికి చెందుతూ, శ్రీ పుల్లయ్యగారి ప్రతిభకు ప్రబల నిదర్శనంగా వుంది.—

## కస్తూరి ఫిలిమ్సువారి "అపవాదు"

గతమాసం 17వ తేదీనాడు కోయంబత్తూరు కస్తూరీ ఫిలిమ్సువారి "అపవాదు" చిత్రంయొక్క ప్రారంభోత్సవం జరిపారు. దర్శకులు శ్రీ రామబ్రహ్మంగారు, తమ శరీరాస్వస్థత మూలంగా చిత్ర నిర్మాణానికి వెంటనే పూనుకోడం జరగలేదని, రిహార్సల్స్ పూర్తి చేసుకుని కోయంబత్తూరు వెళ్లనున్నామని, సుప్రసిద్ధ సంగీత దర్శకులు శ్రీ భీమవరపు నరసింహారావుగారు సంగీత దర్శకులుగా తిరిగి సహకారాన్నిస్తూవున్నందుకు చాలా ఆనందిస్తున్నానని ముక్తసరిగా ప్రసంగించారు—యీ చిత్రంలో శ్రీమతి రాజ్యం, వరలక్ష్మి, శ్రీ రాఘవన్, రఘురామయ్యగార్లు పాల్గొంటున్నారు. వచ్చిన అతిథులకు కాఫీ, తాంబూల సత్కారాలతో నాటి ఉత్సవం మంగళప్రదంగా ముగిసింది.

◆ ◆ ◆ ◆

ఆర్. యస్. పి. పిచ్చర్సువారి తారాశశాంక్ చిత్రం షూటింగు పూర్తయి ఎడిటింగులోవుంది.

◆ ◆ ◆ ◆

జయా ఫిలిమ్సువారి "దక్షయజ్ఞము" షూటింగు చాలా చురుగ్గా జరుగుతోంది. దర్శకులు శ్రీ చిత్రపు నారాయణమూర్తిగారు. కవి శ్రీ బి. టి. నరసింహాచార్యులుగారు.

◆ ◆ ◆ ◆

రాజరాజేశ్వరీ ఫిలిమ్సువారి "తల్లిప్రేమ" షూటింగు చాలావరకు అయినట్లే—

# పుష్పచయము * * *

## ★ విషవాక్యములు

సామాన్యముగా స్త్రీలుగాని పురుషులుగాని తీరికసమయములలో ఏవో గప్పాలుకొట్టడమో, కబుర్లు చెప్పుకోవడమో, ఇతరులను దూషించడమో, లేక కొందరిమీద అపనిందలు మోపడమే అన్నిదేశముల లోను అన్ని తెగలలోను జరుగుతూనేవుంది. కాని ఇది స్త్రీలలో విశేషముగా కనుపడుతుంది. దీని వలన ఇరుగుపొరుగువారితోను, పురజనులతోను పొరపొచ్చములు ఎక్కువయి మనస్పర్ధలు, విరోధ ములు పుట్టి, చివరకి ప్రాణాంతకముగా పరిణమిస్తుంది. దంపతులలో లేనిపోని సందేహములుగలిగి ఎడబాట్లో లేక ఒకరికొకరు విడిచిపెట్టుకోవడమో అవుతుంది.

పూర్వపు స్త్రీలకు గృహకృత్యములు తప్ప వేరే వ్యాసంగముండేదిగాదు., కనుక ఊబుసుపోకకు నలుగురూ కలిసి ఏ యమ్మలనో ఆడిపోసుకోవడమూ వారిసంగతి వీరికి, వీరిసంగతి వారికి చెప్పి కలహ ములు పుట్టించడమూ, వీటిచే కొంత సంతోషించడమూను జరిగేది. ఇప్పటి స్త్రీలకు నిర్వహించవలసిన బాధ్యత, పనులు ఎన్నియో ఉన్నవిగదా! పురుషులతోపాటు అన్ని విషయములలో మేమూ సమాన మని గర్వించుచుండే ఈ నవనాగరిక కాలములలోకూడ ఇట్టి అనవసరమగు లోకాభిరామాయణముతో కాలమునువ్యర్థపుచ్చుచూ, వ్యర్థపుచ్చుటయే గాక మానవులకుండవలసిన స్నేహానురాగము, ఐకమత్యము, గౌరవములను కూకటి వేళ్ళతో పెరికివేయుచుండుటెంత విచారకరము? తమ సంగతినిగురించి ఇతరులు తూలనాడుచుండిన తమకెంత అసహ్యముగా నుండునో అంతే ఒకరినని ఎందుకు తలంపరో?

ప్రపంచమున స్వాతంత్ర్యము, స్నేహము, శాంతి, ప్రేమ నెలకొల్పవలెనన్న బాధ్యత ఇప్పుడు స్త్రీల మీదనే ఆధారపడివుండనేది అన్నిదేశములవారును ఒప్పుకొంటున్నారు. ఎందుకంటే పురుషులలో ఐకమత్యము సున్న, సరళహృదయము లేదు, స్నేహానురాగం శూన్యం. ఇప్పుడు పాశ్చాత్యదేశములో స్త్రీలున్ను కఠినహృదయులై, మాత్సర్యముగలిగి పురుషులతోపాటు ఎంతయో క్రౌర్యమునకును సాహ సించుచున్నారు.

ఇదెంతమాత్రమును దాస్యవిముక్తికి మూలముకాదు. అశాంతి వాతావరణములో జీవనజ్యోతి ప్రకా శింపదు. స్త్రీలయొక్క సహజకోమలహృదయములందు ప్రేమ, దయ, అనురాగం, వాత్సల్యం, భక్తి మొదలగు సుగుణములు తొలుకాడునప్పుడే ప్రపంచము మానవత్వముతో నిండియుండును. ప్రస్తుతమిట్టి విప్లవ వాతావరణమునకు కారణమేమి? పరస్పర వైషమ్యము, ద్వేషము, ఈర్ష్య ఇవన్నియు బాగా వృద్ధిజెంది ఆయా వ్యక్తులకే గాక, దేశదేశమునకే వ్యాప్తిజెంది లక్షలకొలది జనులను ఆహుతిజేయుచున్నది.

ఈ విప్లవముపశమించి శాంతి వాతావరణము కావలెనన్న సహజమానవకల్యాణగుణములగు శాంతము, దయ, పరార్థబుద్ధి, క్షమ, సత్యము, సంతృప్తి మున్నగు సద్గుణములు ప్రబలి చిరస్థాయిగా నుండవలెను.

—శ్రీమతి కృష్ణహాతిసింగు.

## ★ సంసార సౌఖ్యము

మన పెద్దలలో చాలామందికి యౌవనుల నవీన భావాలు, నూతనాశయాలూ పట్టి ఊసుపోని కబుర్లలాగా కలల్లాగా కనపడతాయి. తమ తరువాతి తరంవారంతా ఏదో బ్రహ్మాండమైన వినాశనానికి దారి తీస్తున్నారని వాళ్ల ఊహ. ప్రాచీన నవీనభావ ఘర్షణకి వాళ్లు తట్టుకోలేరు. ఇంక పిన్నలు, తమ దృక్పథాన్ని తమ పెద్దలకు నచ్చజెప్పలేక తమ దారిని తాము పోతారు. ప్రపంచజ్ఞానం వుంటే సులువుగా దాటగలిగే ఆపత్తులుకూడా పెంకితనంచేత తెచ్చుకుంటూ వుంటారు.

తల్లులు కూతుళ్లను అర్థం చేసుకోలేరు. తండ్రులు కొడుకులని అర్థం చేసుకోలేరు. సరే, అత్తాకోడళ్ల సమస్య అనాదిగావున్న బ్రహ్మాండమైన సమస్యే. ఎవళ్లో ఒకళ్లు ఓ మెట్టుదిగి రెండోవాళ్ల ఉద్దేశం యేమిటో తెలుసుకోడానికి ప్రయత్నిస్తే బాగుండును.

పెద్దవాళ్లు తరుచుగా వాళ్లు తమ చిన్నతనంలో తమ అత్తగారివల్లగాని ఓ పినతల్లివల్లగాని లేదా ఇంట్లోవుండివున్న యే ముసలమ్మవల్లగాని తాను అనుభవించిన కష్టపరంపరలు ఏకరువు పెడుతూ వుంటారు. కాని మళ్లీ తన పిల్లలనీ కోడళ్లనీ తాను పడిన కష్టాలలాంటి వాటికే పాలుచేస్తూ తనతోడి వాళ్లతోటి వాళ్లమీద నేరాలు చెబుతారు.

ముఖ్యంగా మనదేశంలో యీ బాధలన్నిటికీ ప్రధానకారణం తమ సంసారం తప్ప బాహ్యప్రపంచంతోటి యే విధమైన సంబంధంలేక స్త్రీల జీవితాలు నిజంగా శుష్కప్రాయాలు అయిపోవడమే. తన కుమారుడి వద్దవున్న తల్లి ఆ సంసారంలో తన కోడలికంటె తనకే యెక్కువ అధికారంవుండాలనుకుంటుంది. నవమాసాలు మోసి కష్టపడికని, మలమూత్రాలకి రోతపడకుండా నానాబాధలుపడి, వాళ్లని పెంచినందుకు పిల్లలు తనకి ఋణపడివున్నారనీ, కృతజ్ఞులై వుండాలనీ నమ్ముతుంది. ఇది కేవలం హాస్యాస్పదం. మన పిల్లలు మనకేమీ ఋణపడిలేరు. పిల్లల కోరికమీద మనం వాళ్లని కనడంలేదు. ఇంక వాళ్లు మనకెందుకు కృతజ్ఞులైవుండాలి? యెందుకు ఋణపడివుండాలి? వాళ్లనీ ప్రపంచంలో పడేసినందుకు వాళ్లని జాగ్రత్తగా కాపాడి వాళ్ల యోగక్షేమాలు విచారించడం మనవిధి. పశువులు కూడా తమ శిశువులని ప్రేమిస్తాయి, జాగ్రత్తగా కాపాడుతాయి, పోషిస్తాయి. కాని అవి పెద్దవై తమ పొట్ట తాము పోసుకోగలిగినప్పుడు దేనిదారి దానిదే. ప్రకృతి కల్పించిన విధానం యిది. మానవులకి పశువులకంటె ప్రేమ పాశాలు గట్టివి. అంత సులభంగా తెగిపోవు. అల్లా తెగిపోడం కూడదు కూడాను. అంతమాత్రంచేత పిల్లలు పెరిగి పెద్దవాళ్లయి ప్రత్యేకంగా జీవించడానికి హక్కు కలిగినప్పుడు అది అసహజమైనట్టుగా దానికి ఆటంకాలు యెందుకు కల్పించాలి?

ఏతల్లీ తనకూతురు సంసారంలో కలగజేసుకోవాలని కల్లోకూడ అనుకోదు. అల్లాంటప్పుడు తన కొడుకు సంసారంలో కలగజేసుకోవాలని యెందుకు కాంక్ష? ఇక, తనకొడుకు నిత్యజీవనంలో యే తల్లీ వేలుపెట్టదు. కాని కూతురుచేసే ప్రతిపనికీ ముందుగా తల్లి సెలవుపొందాలి. ఇక కోడలే అయితే చెప్పనే అక్కరలేదు. స్వతంత్రించి యేపనిచేసినా క్షమించరు. ప్రతి స్త్రీకీ తనసంసారం తాను చక్కపెట్టుకోడానికితగ్గ హక్కు, స్వతంత్రం వుండాలి.

సాధారణంగా పెద్దవాళ్లు ముసలితనం మీద పడిపోతూందని తమ అధైర్యాన్ని వెళ్లబోస్తూవుంటారు. కాలూ, చెయ్యీ్యవంగితే యింక తమకి తిండైనా పెట్టరని వాపోతూవుంటారు. ఉన్నదున్నట్టు గ్రహించాలికాని అల్లా జరిగితే యేమవుతుందో అని ముందే వైమనస్యాలు హెచ్చించడం తగదు.

ఒకప్పుడు తల్లిదండ్రులు కూతురుదగ్గరో, కొడుకుదగ్గరో వుండవలసిన పరిస్థితులు వస్తూవుంటాయి. అప్పుడు ఇతరులు తన్ను నిర్లక్ష్యంచేస్తున్నారనీ, సరిగ్గా చూడడంలేదనీ అనుకోడంవల్లనే యెక్కువ బాధలు కలుగుతుంటాయి. పెద్దవాళ్లు సంసారపుగొడవలు వదిలేసి సంఘసేవకాని మరో కాలక్షేపం కాని పెట్టుకొంటే చాలా సమస్యలు పరిష్కారం అయిపోతాయి. చేసేవాళ్లుంటే ఇంకా బోలెడంత వుంది సంఘసేవా క్షేత్రంలో. సంసారంలో సుఖ శాంతులు తాండవించడానికి యిదే సూత్రం.

"మన హయాము వెళ్లిపోయాక మనపిల్లల హయామువస్తుంది. ప్రతివాళ్లూకూడా తమ జీవితంలో ఒకమాటు కొంతకాలం స్వేచ్ఛానందాలు అనుభవించాలి. మనకి వాళ్లజీవితంలో వేలు పెట్టడానికి అధికారంలేదు" అనేభావాన్ని పెంపొందించుకుంటే సంసారం తప్పకుండా యింకా ఎంతో సుఖతరంగా వుంటుంది. మనమే ఎప్పుడూ అగ్రేసరులమై వుండాలంటే యెవరికీ సాధ్యంకాదు.

—శ్రీమతి కృష్ణహాతిసింగు, (అనువాదం: వినోది.)

★ మన కర్తవ్యము

ఇప్పుడు మనముకూడిన పఠనమందిరమున ముఖ్యముగ మనము నేర్చుకొనవలసినది భాషాజ్ఞానము ప్రపంచజ్ఞానము మాత్రమేగాక సహనము, శాంతి, ఓర్పు సంఘీభావములు అయివున్నవి. రెండు కొప్పులుకూడుచోట కలహప్రియుడు తాండవమాడుచూ అసూయాద్వేషములను పురిగొల్పునను పురుషులలో గల నిరసనభావమును నిర్మూలింపజేయు బాధ్యత మనయందున్నది. స్త్రీ సరస్వతి, పూజ్యురాలు స్త్రీసంకల్పము సహాయములేనిది పురుషుడు వ్యర్థుడు అను విశాలభావములను మనదేశమున స్థాపితము చేయుటకొరకు మనమే కర్తలము కావలయును. స్త్రీ పురుషునిపై ఆధారపడవలసిన బొమ్మయని, నిరాధారియని చిన్నపుడు తల్లితండ్రులవలన, సోదరులవలన, ఆదరిమిలాం భర్తవలన మనము పోషింపబడి వారి ఆధారముపైననే వుండవలసిన వ్యక్తియని చెప్పు సాహసపు మాటలను నిరాధారములని చూపవలసిన బాధ్యత స్త్రీలయందుగలదు. తన్నుతాను అభివృద్ధిపరచుకొన సాహసింపక మరియొకరిపై ఆధారపడవలసి ఉండు కర్మము తనదని స్త్రీ తలచునంతకాలము ఆమెకు కర్మవిముక్తిలేదు. నేనే సరస్వతిని, నేనే ధీశాలిని, నేనే వీరమాతను, నేనే మహాకాళిని, నేనే సర్వమంగళను, ఆదిస్వరూపిణిని, సృష్టికర్తను అని స్త్రీ తలంచుచో ఆమెకు ఏదియూ అడ్డురాజాలదు. అందుకనే రాట్నచక్రము చేధరించిన దేశవిముక్తికి లోకకల్యాణమునకు ఆటంకములుండజాలవని శ్రీ గాంధిమహాత్ములవారు భేరీ ప్రోగించుచూ శంఖారావము చేయుచున్నారు. ఈ పురుషోత్తముని మహత్తరవాక్కును చెవియొగ్గి రాట్నపూజ చేయుభారము వహింప యీ పఠనమందిర సభ్యురాండ్రను వేడుచున్నాను.

—శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారు,

శ్రీ మహాలక్ష్మి పఠనమందిర అష్టమ వార్షికోత్సవంలో.




గోధుమలతో తయారుచేయదగిన వివిధ పదార్థములు—7.

## గోధుమ అప్పడములు

$\frac{1}{2}$ వీశ గోధుమపిండిలో $\frac{1}{2}$ తులం కారం కొంచం వుప్పు, ఇంగువ వేసి నీటితో గట్టిగ కలుపవలెను. 2 గంటలు నాననిచ్చి వుండలుచేసి అప్పడాలు వత్తి ఎండపెట్టి నేతిలో వేయించవలెను.

## పూనాఘవర్సు

$\frac{1}{4}$ వీశ గోధుమపిండి నీటితో గట్టిగకలిపి 1 తులం నెయ్యివేసి బాగా మర్దించి చిన్నవుండలుచేసి దళసరిగా వత్తి నేతిలో వేయించుకొనవలెను. పంచదార లేతపాకంపట్టి ఒక కొబ్బరికాయ కోరివేయించి, ఏలకపొడి, 4 ఫలముల జీడిపప్పు నేతితోవేయించి పాకంలోవేసి, వేగిన బిళ్లలుకూడ వేసి కలుపవలెను.

## గోధుమ సున్ని

అరపడి గోధుమలు వేయించి కొంచం మెత్తగ విసరవలెను. 1 ఆళాకు శనగపప్పు వేయించి మెత్తగ విసిరి గోధుమపిండిలో కలుపవలెను. అరపడి పంచదార పిండిలో పోసి 3 ఆళాకుల నెయ్యి సలసల కాచి పోసి అన్నికలిపి వుండలు చేయవలెను.

## వినోదాలు

ఒక కొబ్బరికాయ కోరి $\frac{1}{2}$ శేరు బెల్లంవేసి పొయిమీద 15 నిమిషములు కలుపుతూ వుంచి దింపి వుండలు చేయవలెను. 1 ఆళాకు గోధుమపిండి, $\frac{1}{2}$ ఆళాకు శనగపిండి నీటితో చిక్కగ కలపి వుండలుచేసి పిండిలోముంచి చమురులో వేసి వేయించి తీయవలెను.

## కొబ్బరి హల్వా

$\frac{1}{2}$ శేరు పాలు మరగనిచ్చి 1 ఆళాకు రవవేయించి వేయవలెను. దానిలో 2 ఫలములు జీడిపప్పు 1 ఫలం బాదంపప్పు 1 ఆళాకు పంచదార 1 ఆళాకు నెయ్యి ఏలకపొడివేసి బాగా కలిపి పళ్లెంలో పోయవలెను. 1 కొబ్బరిచిప్ప కోరి వేయించి పైన చల్లవలెను.

## రవకంకణములు

½ శేరు నీరు సలసలకాగిన తరువాత ¼ శేరు గోధుమపిండి ¼ తులం వుప్పు 1 ఆకాకు రవ ½ ఆకాకు పెసరపప్పు వేసి 10 నిమిషములు పొయిమీదవుంచి దింపవలెను. 1 స్పూన్ జీలకర్ర వేసి కలిపి పీటమీద కంకణములు చేసి వెడల్పు పాత్రలో నెయ్యి మరగించి కంకణములు వేయించి తీయవలెను.

## రవమిఠాయి

¼ శేరు గోధుమరవ నేతితో వేయించి, 1 కొబ్బరికాయ కోరి వేయించి, 1 పంపు జీడిపప్పు, ½ పంపు కిస్మిస్, ఏలకపొడి కొంచెం, 1 శేరు పంచదార పాకంపట్టి దానిలో వేసి, 1 పంపు నెయ్యికాచి పోసి వుండలు చేయవలెను.

## గోధుమ వడలు

పావుశేరు శనగపప్పు నాననిచ్చి రుబ్బి 1 పంపు గోధుమపిండి, 2 ఫలముల నీరుల్లి ముక్కలు, 1 తులం అల్లంముక్కలు ½ తులం పచ్చిమిరప ముక్కలు 1 తులం ఉప్పు అన్నిటిని కలిపి బిళ్లలుచేసి నూనెలో వేయించవలెను.

## తైర్ వడ

1 శేరు పెరుగులో తగినవుప్పు, పసుపువేసి 1 కొబ్బరిచిప్పకోరి కలిపి, ఆవాలు మెంతులు ఇంగువ, కర్వేపాకు, అల్లం పచ్చిమిరప ముక్కలు, ఎండు మిరపముక్కలు వేయించి పెరుగులో కలుపవలెను. ½ శేరు మినపపప్పు నాననిచ్చి రుబ్బి, 1 తులం వుప్పు, 1 పంపు గోధుమరవకలిపి వడలుచేసి నూనిలో వేయించి పెరుగులో వేయవలెను.

## బీరకాయి బజ్జీ

పంపు గోధుమపిండి, ½ పంపు శనగపిండి తగువుప్పు, కారం, జీలకర్ర, కొంచెంసోడావేసి, చిక్కగ కలపి బీరకాయి పల్చగాతరిగి పిండిలోముంచి చమురులో వేయించి తీయవలెను.

## గోధుమ పాలకాయిలు

పావుశేరు గోధుమపిండి, పావుశేరు వరిపిండి, అరతులం ఉప్పు, ¼ తులం వాము వేసి నీటితో గట్టిగ కలిపి చిన్న వుండలుచేసి నేతిలో వేయించవలెను.

—సి. హెచ్. అన్నపూర్ణాబాయి.

## —బంగారుపతకం బహుమానం—

గోధుమ ధాన్యముతో చేయుదగిన వలువిధములైన పదార్థములను, గత సంచికల లోని ఆరు పట్టీలయందు ప్రకటింపబడినవి గాక, ఎక్కువ పదార్థములను వ్రాసి పంపినవారికి ఒక 'బంగారుపతకము' బహూకరింపబడును. వెనుక గృహలక్ష్మిలో ప్రకటింపబడిన వాటినిగూడ ఎత్తివ్రాయగూడదు.

సంపాదకుఁడు.

# గ్రంథ సమీక్ష

## అణా గ్రంథమాలవారి ప్రచురణములు

చిరునామా:—3691 బి. తూర్పుబజారు, హైద్రాబాదు, దక్కను.

**హైద్రాబాదు రాజ్యాంగ సంస్కరణలు, అణాకథలు, స్వామి దయానంద సరస్వతి, వినాయక్ దామోదర్ సావర్కర్, కాంగ్రెసు చరిత్ర-ఒకటిరెండు భాగములు, జాగీరులు, పండిత జవహర్లాలు నెహ్రూ.**

సుమారు 40పేజీలు కలిగిన ఒక్కొక్కపుస్తకం ఒక్కొక్క విశిష్టతకలిగి వుంది. ప్రసిద్ధ రచయితలు శ్రీయుతులు వెల్దుర్తి మాణిక్యరావు, కాళోజీ నారాయణరావు, యన్. కె. రావు, కె. రంగదాసు, జానపాటి సత్యనారాయణ, ఉమ్మెంతల కేశవరావు, సురవరం ప్రతాపరెడ్డిగార్ల రచనలు యీ ప్రచురణలలోవున్నాయి. విజ్ఞాన ప్రభోధానికి ఉత్కృష్ట విషయాలను క్లుప్తంగా రచించి, పండిత పామరులందరికి అందుబాటులో వుండేటట్టు అణా ఖరీదుకే అందజేస్తూవున్న యీ గ్రంథమాలవారి ప్రయత్నం సంస్తవనీయంగా వుంది. హైద్రాబాదు ఆంధ్రసోదరులలో యీ ప్రచురణలు విరివిగా ఆదరణను పొందుతాయనడం అతిశయోక్తికాదు.

## రెండో ప్రపంచ యుద్ధమా? (రెండవ భాగము)

ఆంధ్రకేసరి గ్రంథమాలవారి మూడవ ప్రచురణము. వెల ఆరు అణాలు. చిరునామా: 178, సుల్తాన్‌బజారు, హైద్రాబాదు, (ద)

మొదటి భాగంలో సమాప్తి చెందిన మ్యూనిక్ పాక్ట్ తర్వాత చరిత్ర, జర్మనీ ఫ్రాన్సు నాక్రమించడం వరకు యీ భాగంలోవుంది. రచనమాంచి బిగువుగా, సులభమైన శైలిలో మొదటి దానివలెనే చక్కగావుంది. ప్రస్తుతం సర్వప్రపంచాన్ని తల్లడిల్లజేస్తూవున్న నేటి యుద్ధ పరిస్థితులు తెలుసుకోవడానికి యీ రెండు భాగాలు తప్పక చదివితీరాలి. పుస్తకంలోని విషయాలను వివరించే 'మేపులు' కూడా కొన్నివుంటే ఇంకా చక్కగా వుండేది. అత్యంతోపయుక్తమైన యీ రెండు భాగాలను చక్కని శైలిలో రచించిన గ్రంథకర్త నామము ప్రకటింపకపోవడం శోచనీయంగావుంది—

## అంజలి

సాధనసమితివారి 'ప్రత్యూష' ప్రచురణము. చిరునామా: సాధనసమితి, సికింద్రాబాదు. దక్కను. వెల తెలియదు—

శ్రీయుతులు బూర్గుల రంగనాథరావు, పిల్లలమర్రి వేంకట హనుమంతరావు, భాగి నారాయణ మూర్తి మొదలగు సుప్రసిద్ధ రచయితలయొక్క గేయాలు "నా రాణి", 'దివ్యగీతి' మొదలైన మేటటా

లతో యిందులో వున్నాయి. భావబంధురమై, భావవీథుల్లో విహరింపజేసే చక్కని గీతికలుకలిగిన యీ సంపుటి సమితి సభ్యులయొక్క నవ్యకళోపాసనకి ప్రబల నిదర్శనంగావుంది.

## పరీక్షచదువు

కర్త: శ్రీ భాగి నారాయణమూర్తి ఇదీ "ప్రత్యూష" ప్రచురణమే. వెల పావలా.

"పరీక్షచదువు", "పరీక్షలపుడు", "పరీక్షల తరవాత"అనే మూడు భాగాలుగా రచింపబడ్డ నాటికల సంపుటి ఇది. విద్యార్థులయొక్క మనో ప్రవృతులను వ్యంగ్యంగా చిత్రించారు కవిగారు. ప్రతీ విద్యార్థి చదువ తగ్గది.

## గాంధి మహాత్ముడు (మొదటి, రెండవ భాగములు)

కర్త: "విష్ణుచక్రం". శ్రీ దేశోద్ధారక గ్రంథమాల, హైద్రాబాదువారి 9, 10-వ ప్రచురణములు. వెల ఒక్కొక్కటి ఆరు అణాలు.

ఈ రెండు పుస్తకాల్లోనూ మహాత్ముని యొక్క జీవితచరిత్రకంటె ఆయన సిద్ధాంతములయొక్క వివరణకే ఎక్కువ ప్రాధాన్యత ఈయబడింది. యుగపురుషుడైన మహాత్ముని ఆశయ, సిద్ధాంతాలను గురించి ఎంత చర్చించినా వెలితివుంటూనే వుంటుంది. అయినా గ్రంథకర్తగారు వారి ప్రయత్నంలో జయం పొందారనే చెప్పవచ్చు.

## తెనుగుతల్లి

కర్త: శ్రీ వేదాంతం వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. చిరునామా మహారాజశ్రీ బుక్ సెల్లర్సు, గవర్నరుపేట, బెజవాడ. వెల రూపాయి.

ఇది ఒక నూత్న సాంఘిక నాటకము. నాటకంలో కథావస్తువు చాలా పేలవంగావుంది. ఎవరెవరో ప్రత్యేక వ్యక్తులను దృష్టిలో పెట్టుకుని వ్రాసినట్లు ఆమూలాంతం కనపడుతుంది. ఇంతకన్న చక్కని కథావస్తువు తీసుకొని రచనసాగిస్తే కవిగారు మంచి నాటకాలు ప్రసాదించగలరు.

## సూర్యసాముద్రికము

గ్రంథకర్త: జ్యోతుల సూర్యనారాయణమూర్తిగారు, కాకినాడ. 1/8 డెమ్మీసైజు 325 పుటలు. చక్కని బైండు - వెల 3—0—0

గ్రంథకర్తగారు పెక్కు హైందవ, పాశ్చాత్యగ్రంథములలోని విషయములను ఒక్కటిగాచేర్చి 550 చిత్ర పటములతో పఠించువారికి గ్రాహ్యమగునటుల సులభశైలిలో నీ గ్రంథము వ్రాసియున్నారు. కాని వారి అనుభవ విషయములనుకూడ నిందులో చేర్చియుండిన మరింత వన్నెతెచ్చియుండును. హస్త స్వాభావ భాగము, హస్త రేఖాభాగమని రెండు భాగములుగా నీ గ్రంథము విభజింపబడి యున్నవి. మొదటిభాగము నందు హస్తపరిణామము, హస్తపరిమాణము, అరచేయి, గోళ్లు, వేళ్లు, గ్రహములు, త్రిభుజము, చతుష్కోణము వర్ణింపబడినది. రెండవభాగమునందు ప్రధానరేఖలు, వైవాహికరేఖ, సంతానరేఖ, శుక్రచాపము మణిబంధ రేఖలు, చిహ్నములు చక్కగా వర్ణింపబడినది గావున సాముద్రిక శాస్త్రమును నేర్చుకొనువారికిని నేర్చు కొనిన వారికిని మిక్కిలి ఉపయోగకారిగా నుండును. ఆంధ్రములో నిట్టి పెద్దగ్రంథములేని లోటును పోగొట్టి గ్రంథకర్తగారు ఆంధ్రులమన్ననలకు పాత్రులైనారు.

# యుద్ధరంగము

- మధ్యధరాలో యుద్ధము
- అమెరికా నిశ్చయము
- గ్రీసులో జర్మనీ ప్రవేశమా?
- జపాన్ బెదరింపు

— అరుంధతి —

అమెరికా సంయుక్తరాష్ట్రములు బ్రిటనుకు ఆయుధసంపత్తి నిచ్చి, బ్రిటనుకు సహాయముచేయుటకు నిశ్చయించుకొనినప్పటినుండియు, ఆక్సిసు రాజ్యములు జర్మనీ - ఇటలీ - జపాన్‌లు ఈ యుపద్రవము తీవ్రముకాకపూర్వమే యుద్ధమును కొంతవరకు అనుకూలమొనర్చుటకు పటుప్రయత్నములను కావించుచున్నవి. తదనుగుణ్యముగ పెటియన్ సేనాని ప్రతికూలవైఖరి మాని, అనుకూలుడగుట వీరికి చింత దక్కి బలము సమకూడినది. పెటియన్ తాను పదచ్యుతుని కావించిన లావెల్‌ను తిరిగి విచీ మంత్రివర్గమున చేర్చుకొనబోవుచున్నాడు. జర్మను పక్షపాతియైన లావల్ విచీ మంత్రివర్గమందున్నంతవరకు జర్మనీకి ఎట్టి భయమును కలుగదు. అందువలన భవిష్యత్కార్యక్రమ నిర్ణయమునకై హిట్లరు - ముసోలినీలు సమావేశమైనారు. వారేమి నిర్ణయించుకొనినదియును ఇంతవరకు తెలియలేదు. కాని భవిష్యత్ సంఘటనలబట్టి ఇది చాలవరకు తెలియబడగలదు.

## మధ్యధరా సముద్రములో యుద్ధము

ఇటు మధ్యధరాప్రాంత రంగములలో పరాజయ పరంపరల నందుచున్న ఇటలీకి సహాయపడుటకై జర్మను సేనలు విరివిగ వచ్చి సిసిలీద్వీపము నాక్రమించినవి. ఇదియేగాక సిసిలీ జలసంధికి తూర్పువైపున నున్న పంటెలేరియా ద్వీపమందుకూడ జర్మను బలములు ప్రవేశించి విమానాశ్రయములను, రేవులను ఆయత్తపరచుచున్నవి.

గ్రీసుకు బ్రిటను సహాయార్థమై పంపు ఆయుధసామగ్రి యంతయు యీ సిసిలీ జలసంధిగుండా పోవలసియున్నది. ఇంతకుపూర్వము ఇటలీ ఎన్నడును అట్టి బ్రిటిషు నావలను ఎదుర్కొనియుండలేదు. కాని జర్మను రాకతో ఇదియంతయు తారుమారైనది. బ్రిటనునుండి గ్రీసు రంగమునకు ఆయుధములు కొనిపోవు నౌకలపై, సిసిలీనుండి జర్మను-ఇటాలియను విమానములు వచ్చి తీవ్రముగ ఎదిర్చినవి. జర్మను - ఇటాలియను విమానములు 12 పడగొట్టబడినను, ఆయుధనౌకలు తప్పించుకొని పోగలిగినను "సౌథాంప్టన్" అను బ్రిటిషు యుద్ధనౌక, "ఇలస్ట్రియస్" అను విమాన యుద్ధనౌకయు చాలవరకు శిథిలమైనవి. కొన్నిమాత్రము మాల్టా రేవునకు చేరినవి గాని అచ్చటకుకూడ జర్మను విమానములు వచ్చి బాంబులు వేసినవి.

దీనివలన మధ్యధరాసముద్రములో బ్రిటిషు నౌకలు పూర్వమువలె నిరపాయముగ ప్రయాణము చేయ వీలులేదని స్పష్టమైనది.

ఇటలీ గ్రీసుపై దండెత్తినప్పటినుండియు ఇంతవరకు ఒకచోటనైనను విజయముపొంది ఎరుగదు. గ్రీసు సైన్యములు ప్రతిదినము ఒక్కొక్క క్రొత్తమార్గము నాక్రమించుచునే యున్నవి. ఈ రంగమందు ఇటలీ సర్వసేనానియైన బడొగ్లియోను తొలగించి సొడ్డూ అనునాతని నియమించగా, అతడుగూడ తన పదవికి రాజీనామా నిచ్చియున్నాడు. ఇప్పుడు ఇటాలియను ప్రధాన సేనానియైన కెవల్లెరో ఆ స్థానమున నియమింపబడినాడు. ఈ మార్పులవలన గ్రీసు రంగమందు ఇటలీవారికి ఆశావహముగ లేదని కన్పట్టుచున్నది.

● గ్రీసులో జర్మ[illegible] ప్రవేశమా

ఇప్పుడు వ్[illegible] రాసముద్రమ్మ[illegible]ర బ్రిటిషు నౌకలకు జర్మను విమానములు కల్గించుచున్న అంతరాయములవలన గ్రీసు రం[illegible] ఇటలీకి జ[illegible]యము లభింపకపోయిన, జర్మనీ ఆ రంగమున ప్రవేశింపక తప్పదు. ఇప్పుడు ఇటలీలో కే[illegible]ంపబడిన జర్మను సైన్యమంతయును బల్గేరియామీదుగ గ్రీసు రంగమున ప్రవేశింప వచ్చును. తటస్థరాజ్య[illegible], బల్గేరియా[illegible] రుమేనియా సరిహద్దులలో జర్మను సైన్యములు 2 లక్షల వరకును అప్పుడే చేరియున్నవి. [illegible]రియా, రష్యా[illegible] ఏమియు చేయకుండుట జూచి తన తాటస్థ్యమును విఘ్నమొనరించుకొనినది. బల్గేరియా ప్ర[illegible]మంత్రి రిబ్బస[illegible]టాపుతో యీ విషయమై ఆలోచనలు జరుపుచున్నాడు.

బల్గేరియావి[illegible] గాని, యు[illegible]గోస్లేవియామీదుగ గాని జర్మను సైన్యములను నడిపించిన బాల్కను రాష్ట్రములన్నియు క[illegible] పతిఘటించు[illegible]ని టర్కీ తెలియజేసినది. దీనిని నిరోధించుటకు బ్రిటనుతో టర్కీ రాయబారములను జర[illegible]న్నది. ఇది కొనసాగినచో బాల్కను రాజ్యములలోగూడ జర్మనీ చిచ్చు ముట్టించినదని చెప్పవచ్చు.

ఇటు దక్షిణ[illegible] ఆఫ్రికాలో[illegible] లిబియారంగమున ఇటాలియనులకు గ్రేజియానీ నాయకత్వముక్రింద ఏవిధమైన విజయము ల[illegible]చలేదు. ఈ సైన్యములకు ఇటలీనుండి ఆహారముల సప్లై కూడ వచ్చుచుండుటలేదు. టొబ్రూకు దుర్గమును [illegible]షు సైన్యము[illegible] శతఘ్నులతోను, బాంబులతోను శిధిలము చేయుచున్నవి. బర్డియావలె నిదికూడ బ్రిటిషు [illegible]న్యములకు [illegible]లదికాలములో లొంగిపోక తప్పదు. కాని జర్మను విమానములు ఆహారమును, సైన్యమున[illegible]చ్చట దింప[illegible]లిగినను, ఇప్పటికి 3 లక్షలవరకు అచట చేరియున్న బ్రిటిషు సైన్యము ముందు ఇది నిల్చుట అ[illegible]స్యము.

● అమెరికా నిశ్చ[illegible]యము

బ్రిటనుకు ఆ[illegible]ములను స[illegible]ఫరాచేసి బ్రిటను పక్షమున యుద్ధమున ప్రవేశించుటకై రూజువెల్టు సభాపతి తెచ్చిన చట్టము[illegible] అన్ని పార్టీలును సుముఖత్వమును జూపినవి. కాని బ్రిటనుకు సహాయము చేయుచు, తాను ఆత్మ[illegible]క్షణచేసి[illegible]నుచు, దక్షిణ అమెరికావద్దను, తదితరచోట్లను తనకున్న ద్వీపులను కాపాడుకొనుటకుగాను [illegible]ధములు [illegible]రివిగ కావలసియున్నవి. వీటి నన్నిటిని శీఘ్రగమనములో ఉత్పత్తి చేసుకొనినగాని అమెరిక[illegible]రపాయగ[illegible] [illegible]ండజాలదు. ఇందుకొరకు అమెరికా పూర్తిగ యుద్ధమందు కాలిడుటకు ఇంకను రెండు మూ[illegible] మాసములు పట్టును.

ఈ విషయము[illegible] యునైటెడ్ స్టేట్సు కార్యదర్శి స్టిమ్సనుగారు 60, 90 రోజులలో ఐరోపాలో విషమస్థితి ఏర్పడుననియు, సెనటరు వీ[illegible]రుగారు ఏప్రెల్ మాసములోగా బ్రిటను తరఫున అమెరికా యుద్ధమున దిగునని అనుకొనుచున్నారు[illegible] [illegible]యిటీవ[illegible] చర్చలలో తెల్పియున్నారు.

ఈ వ్యవధిలో[illegible] [illegible]నీకూడ [illegible]క్రమిత దేశములలోని ఉక్కు, బొగ్గు, ముడిపదార్థములను పోగుచేసి క్రొత్త యంత్ర నిర్మాణము[illegible] ఆయత్త[illegible]డుచున్నది.

● జపాన్ బెదరింపు[illegible]

యునైటెడ్ స్టే[illegible] [illegible]యా ప్రవర్తనమునకు జపాన్ ప్రభుత్వము భయపడుచున్నది. అందువలన [illegible]కొనోయి ప్రధాని, [illegible]ర్థిక, పారిశ్రామిక వర్గముల నాయకులనందరిని సమావేశపరచి దేశములో వివిధసంఘము[illegible] దేశసేవాసంఘములను ఏర్పరచి ఆసియాఖండములో తమ ప్రాబల్య

మును సిరస్థాయి చేసుకొనవలయునని హెచ్చరించియున్నాడు. ఇందువలన దూర ప్రాచ్యమునగూడ త్వరలో అమెరికా, జపాన్ ఘర్షణ ప్రారంభమగునని స్పష్టమగుచున్నది.

కాని రష్యాతో నిరాక్రమణ ఒడంబడిక కుదురకుండు వలనను, చైనాయందు విశ్రాంతి లభింపకుండుటవలనను జపాను ఇంకను గట్టి నిర్ణయమునకు రాజాలకున్నది.

చైనా ప్రజలలో విచ్ఛేధముల కల్పింప జపాను ఇదివరకునుండిరి ... చున్న ప్రయత్నము కలిసివచ్చుటకే యనునట్లు చంగ్-కై-షేక్ సైన్యములలో చంగ్ సైన్యా ... కుమింగుటాంగు పక్షపువారికిని మనస్పర్థలు ఎక్కువగుచున్నవి. కమ్యూనిస్టు సైన్యములను ఇంకొక ... పంపినగాని సేనానాయకులు ఉత్తరవుల పాలించుటకు నిరాకరించిరి. అందువలన యీ విభేధముల ... కు చంగ్-కై-షేక్ ఆ కమ్యూనిస్టు నాయకుల నరస్టుచేయించక తప్పినదిగాదు.

ఈ విభేధములు ప్రబలముకాకున్న చైనా జపాన్‌కు లొంగిపోవుట ... స్పదము. జపాన్ ముందుగ యీ విషయములను అనుకూలముచేసికొనుటకు తీవ్రప్రయత్నము చేయుచున్నది.

ఏది ఎటులున్నను యీ సంవత్సరారంభమున నూతన సంవత్సర సందేశములో సార్వభౌముడు కొలదికాలములోనే బ్రిటన్‌కు విజయము తప్పదని చెప్పియున్నాడు. చర్చిలు ప్రధాని మాత్రము వరకును యుద్దము సాగవలసియుండునని తెల్పియున్నాడు. హిట్లరుగూడ తన జర్మనుప్రజలకు సందేశమిచ్చుచు యీసంవత్సరము తమకు సంపూర్ణ విజయము లభించునని వాగ్దానము చేసియున్నాడు. కాలగర్భములో ఏమియున్నదో చెప్పజాలము గాని, యీ సంవత్సరము, పూర్వముకంటె పరిస్థితులు విషమించి దారుణ పరిణమించి, ప్రపంచమునకు చాల ఉపద్రవకరమగు సంఘటనల దెచ్చునని చెప్పకతప్పదు.

(27-1-1941)

# పత్రికా పరిచయము

## వాణి - పక్షపత్రిక

సంపాదకులు శ్రీ యం. వి. నాధంగారు, లాయడ్సురోడ్డు, రాయపేట మదరాసు. సంవత్సరం చందా రు. 1-4-0లు, విడిపత్రిక ఒకఅణా.

ప్రథమసంపుటం, ప్రథమసంచిక మా కార్యాలయం చేరింది. సుప్రసిద్ధుల వ్యాసాలతోటి, చక్కని చిత్రాలతోటి, "వాణి" ఇటీవల క్రొత్తగా వెలువడిన పత్రికలలో రాణిస్తోంది.

శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారి "ఔరంగజేబు పాదుషాకు పట్టాభిషేక ప్రాయచిత్తము", శ్రీ లింగమూర్తిగారి "తారగదిలో చంద్రుడు" మొదలైన వ్యాసాలు చాలా హృదయంగమంగా వున్నాయి. సుప్రసిద్ధ వ్యంగ్యచిత్రకారులు శ్రీ తలిసెట్టి రామారావుగారి "... కారుకో" అనే వ్యంగ్యచిత్రం పత్రికకు ఒకప్రత్యేకత నిచ్చింది.

ముచ్చటైన ముఖచిత్రంతో చక్కని వ్యాసములతోటి ఉత్తమతరగతికి చెందిన యీ పత్రిక ఆంధ్ర మహాశయుల ఆదరాన్ని అమితంగా అందుకుంటుందని ఆశిస్తాము.

## కాగడా — 'జన్మదిన సంచిక'

సుప్రసిద్ధ పత్రికానిర్వాహకులు శ్రీ తాపీ ధర్మారావుగారి సంపాదకత్వంలో వెలువడుతూన్న కాగడా తన దివ్యకాంతులను దేశమంతటా దేదీప్యమానంగా ప్రసరి...

మొదటిసంవత్సరం పూర్తిలో వెలువడిన యీ జన్మదిన ... చక్కగావుంది. ప్రసిద్ధుల వ్యాసాలేకాక, సుప్రసిద్ధాంధ్ర చిత్రకారులు శ్రీ చేమకూరవారి ... సంచికకు నూత్నశోభ నిచ్చాయి. తీవ్రమైన విమర్శనలతోటి, బుద్ధికి చురుకునిచ్చే కథలతో ... లన వెలంతురేగాదు, వేడి కూడా వుందోయ్" అనిపిస్తోంది. అందరూ ముఖ్యంగా చదవదగ...




## వారసత్వపు చట్టము

“హిందూ స్త్రీల ఆస్తిహక్కుల”ను గురించి గత నవంబరు మాసమున జరిగిన భారత శాసనసభయందు శ్రీ అఖిలచంద్రదత్తాగారి బిల్లు ప్రతిపాదనపై శ్రీయుతులు దేశముఖ్, గాడ్గిల్, సంతానం, ఛటోపాధ్యాయ ప్రభృతుల ఆందోళన ఫలితముగ ప్రభుత్వము ఈ బిల్లులను చర్చించుటకు ఉపసంఘమును నియమించినది. ఇది శుభసూచకము—

ఆస్తి హక్కులందు పురుషులకే ప్రాధాన్యతగలిగి, పూర్వకాలము నుండియు వచ్చుచున్న యీ యాచారము 1937 సంవత్సరపు ప్రభుత్వచట్టముచే కొన్ని కొన్ని హక్కులు స్త్రీలకు లభ్యమైనవి. కాని వారసత్వపు హక్కు సందర్భమున యీ చట్టము స్త్రీలకు పూర్తిగ నుపకారికాజాలక పోయినది.

తిరిగి నాటినుండియు యీ చట్టమును సవరించుటకై ప్రతిపాదనలు జరుగుచునే యున్నవి. కాని మహిళా సంఘముల ఆందోళనము వలనను, శాసనసభ్యుల దీక్షవలనను నేటికిది ఒక ఆకారమును పొందనున్నది.

సమరసమైన సమాజ నిర్మాణము నేడొక క్లిష్ట సమస్యయైనది. ఇందు ఆర్థికవ్యవస్థ ప్రధానస్థానము నాక్రమించియున్నది. స్త్రీ పురుషులకు సంఘజీవనమున సమాన స్థానములు సంస్థాపన జేయవలసియున్న నేటి పరిస్థితులలో పుత్రులను, పుత్రికలను వ్యత్యాసమును నిర్మించు ఆచారములకు స్థానముండజాలదు.

ప్రాతపద్ధతులంట ఎట్లున్నను నేడు తల్లిదండ్రుల దృష్టిలో స్త్రీ పురుష సంతానమునకు సమానమైన న్యాయము జరుగుటలేదు.

ఆస్తి హక్కు విషయముననే కాక విధ్యావిషయమున గూడ స్త్రీలకు ‘చాకలిపద్దు చదువు’ మాత్రమే లభ్యమగుచున్నది.

వారసుడైన పుత్రుడు మాత్రమే సంపాదనార్హత కలుగువరకుగాని మరి ఇతర విషయముల కొరకుగాని విద్యను సంపాదించుచున్నాడు.

స్త్రీ మాత్ర మిట్లుగాక, విద్యావిహీనయై, ఆర్థిక పరాధీనయై, స్వశక్తి నిరోధయై పురుషుని దయాధర్మ వీక్షణముల కట్టుబడుచున్నది.

తల్లిదండ్రుల సంపాదనములో హెచ్చులొచ్చులులేని పక్షమున ఈ యన్యాయము ఉపేక్షణీయము గాదు. ‘వారసత్వము’ను హక్కు ‘తల్లిదండ్రుల ఆస్తి’కి గలదేని పురుషసంతానముకంటె, విద్యాలోపము జరిగిన స్త్రీ సంతానమునకు కొంత ఆర్థికవసతి అధికముగా తప్పక కల్గించవలసియున్నది. ఇది త్రికరణశుద్ధిగ జరుగవలసిన కర్మము.

ఆర్థికవిషయమునకు జెందిన ఇవన్నియు, యీ వారసత్వపు చట్టమందు చర్చింపబడనుండుట సంతోషింపదగియున్నది.

ఇదియునుగాక 1937 వ సంవత్సరపు చట్టము ప్రకారము వితంతువులకు సంక్రమించిన హక్కులు ఇప్పుడు కూతుళ్లకు సంక్రమింపజేయుటనుగూర్చి యీ యుపసంఘము సలహా నీయబోవుట అభినందనీయమగు విషయము.

ప్రభుత్వముచే నియమింపబడిన యీ యుపసంఘమందు ఒక స్త్రీ సభ్యురాలైన లేదు. స్త్రీల విషయమై చర్చింపబడు ఇట్టి సంఘమందు ఒక స్త్రీ యున్న, ఎట్టి ఆక్షేపణలకు చోటులేని, సర్వ స్త్రీజనామోదమును పొందు ఉత్తమ సలహాలు వచ్చుట కవకాశముండెడిది. ప్రభుత్వ మీవిషయము గమనింపకుండుట శోచనీయము.

ఏది ఎట్లున్నను కలకత్తా ప్రధాన న్యాయమూర్తులైన శ్రీ బి. యన్. రావుగారి అధ్యక్షతను యీ సంఘము ఢిల్లీలో సమావేశమై చర్చించుచున్నది.

మహిళాసంఘముల తీవ్రాందోళన ఫలితముగ ఇట్టి మార్పుకలుగనుండుట హర్షింపదగిన విషయము.

♦ ♦ ♦ ♦

## ఆంధ్రభీష్ముని అస్తమయము

'ఆంధ్రభీష్మ' శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు పరమపదించినారు— ఆంధ్రులకు పెద్ద దిక్కు కరవై పోయినది.

ఆంధ్రాభ్యున్నతికేకాక, భారత జాతీయాభ్యున్నతికి కూడ పంతులుగారుపట్టుగొమ్మ. కాంగ్రెసుకు జనరల్ శక్రటరీగ పనిచేసి ఆసేతుసీతనగపర్యంతము సంచారముచేసి కాంగ్రెసుకు అమితముగ ధనసంపత్తిని చేకూర్చి, కాంగ్రెసును బలవంత మొనర్చిన మహానుభావుడు పంతులుగా॥

ఆంధ్రదేశమందు పుట్టి, పెరిగి, వర్ధిల్లిన ఏ యుద్యమమైనను, ఏ సంస్థయైనను వీరి దివ్యహస్తము లేనిది అరుదనిన, శ్రీ పంతులుగారి దేశసేవాసక్తి విదితమగును.

పంతులుగారికి భగవద్గీతయనిన భక్తి, ప్రేమలు మెండు. రాజమండ్రిలో హిందూ సమాజమును కట్టించి అందు గీతా పరీక్షలుపెట్టి బహుమతులిచ్చు నేర్పాటు గావించి, ఆర్యవిద్య వ్యాప్తికి పాటుబడిన మహాపురుషుడు పంతులుగారు.

పంతులుగారి నిర్యాణమువలన ఆముష్మికులకొక వేదాంతవేత్త, విద్యార్థులకొక విజ్ఞానఖని, దేశసేవకులకొక రాజకీయవేత్త, రైతు జనులకొక దీనబాంధవుడు, యువకులకొక కార్యోత్సాహి కరువై పోయినాడు.—

పంతులుగారి స్త్రీ జనసేవ మరువరానిది. రాజమండ్రి వితంతు శరణాలయమునకు వీరొనర్చిన అఖండమైనసేవకు స్త్రీలోకము సర్వదాకృతజ్ఞులై యుందురు.

జీవితములో నిమ్నోన్నతముల నన్నిటిని అనుభవించి, పుష్కలముగ ముసార్జించి, చివరవరకును దేశసేవలో నిమగ్నులై ఆంధ్రులలో కార్యోత్సాహమును రగుల్కొల్పిన కర్మవీరుడు పంతులుగారు—ఈ మహామహుని జీవిత విశేషములు ఆంధ్రజాతికేగాక అఖిల భారతజాతికి గూడ వెలుగురేఖలు—

భారత వీరవీరాంగనలకు భీష్మాచార్యునివలె, ఆంధ్ర వీరవీరాంగనలకు ఆంధ్రభీష్ముడై, ఆ గంగానందనునివలె యీ పూతచరితుడుగూడ ఉత్తరాయణ పవిత్ర దినములు ప్రవేశించిన తర్వాతనే జీవితమును చాలించినాడు—ఆంధ్ర భీష్ముడు భారతభీష్ముడు—

పంతులుగారి పవిత్రాత్మకు చిరశాంతి కలుగుగాక!

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapetta Madras.